# వి జ్ఞ ప్తి



ఈ కావ్యగుచ్ఛము ఆంధ్రకావ్యమాలా తృతీయపుష్పము,

తొలుత వత్సరమున నాలుగు గ్రంథములను బ్రచురింపఁ దలపెట్టి తిమి. ఆ విధముగనే చందాదారులకుఁ దెలిపియుంటిమి. కానీ తలవని తలంపుగా నుద్భవిల్లిన యుద్ధమువలనఁ గాగితపువెలయు, దానిని బట్టి ముద్రణవ్యయమును బెరుగుటవలనను చందాదారులు వలసినంతమంది లభింపక పోవుటచేతను ఈ వత్సరమును మూఁడు గ్రంథములను మాత్రమే ప్రకటింపఁ గలిగితిమి. ఉదారాశయులగు మా సభ్యులు మా క్లిష్టస్థితినిఁ బరికించి యెప్పటివలె మాకు సాహాయ్య మొనర్తు రని విశ్వసించు చున్నాము.

ఒక సంవత్సరమున నొక గ్రంథకర్తయొక్క పుస్తకములు రెంటినిఁ బ్రకటింపఁగూడ దనియే మాలోద్దేశము. కానీ యీ సంవత్స రము మొదటి దగుటచే గ్రంథములు సకాలమునకు గ్రంథకర్తలవద్దనుండి రామిచే మొదటి రెండును నొక గ్రంథకర్తవే ప్రచురింపవలసి వచ్చినది. ఈ వ్యతిక్రమము ముందు జరుగ దని మనవిచేయుచున్నాము.

శిరోమణి

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి,

వ్యవస్థాపకుఁడు.

శ్రీః

# తొలి పలుకు



"శృంగార ఏవ మధురః పరః ప్రహ్లాదనో రసః."

విప్రలంభాత్మకమగు నీ ఖండకావ్యమున ప్రేయసీ వియోగమునం గుములు ప్రణయమూర్తి యగు నొక తరుణ ప్రవాసియొక్క యొకనాటి భావప్రపంచము వర్ణితము.

అంగాంగవర్ణనా ప్రాధాన్యముం దొరఁగిన భావశబలమగు నుదాత్త శృంగార మిందు యథాశక్తి నిబద్ధము.

ఇం దేమేని గుణలవ ముండినఁ దత్ప్రశస్తికిం బాత్రులు, మదాంధ్ర విద్యాగురువులు, సుగృహీతనామధేయులును ఆది కళాప్రపూర్ణులు నగు బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రి పాదులవారి యంతేవాసులు, గురుతుల్యులు, గీర్వాణాంధ్రాంగ్ల సారస్వత నదీష్ణులు, సహృదయ చూడామణులు, ప్రకృతము విక్రమసింహపురమున వి. బి. యమ్. గిరల్సు హైస్కూలులో నాంధ్రపండితులు నగు బ్రహ్మశ్రీ కైపా సుబ్రహ్మణ్య శర్మగారు.

ఆంధ్రభారతీ కైంకర్యమున నాకుం గను దెఱపి యొరవడిం దిద్దిన యా నా గురుచరణుల చరణసరోజములకు నా యీ ఖండకావ్యప్రసూనము కృతజ్ఞతాపూర్వకముగ సమర్పించుచున్నాఁడను.

నా యీ గ్రంథమును తమ కావ్యమాలలోఁ బ్రకటింప నంగీకరించి నిర్దుష్టముగ ముద్రింపించి పాఠకలోకమున కందించిన యాంధ్రకావ్యమాలా వ్యవస్థాపకులగు, బ్రహ్మశ్రీ శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారికి నా కృతజ్ఞతాపూర్వక ధన్యవాదముల నర్పించుచున్నాఁడను.

కలసపాడు,<br>12—3—1940.

ఇట్లు,<br>అవధానము చంద్రశేఖరశర్మ.

1. విషయవాహిని – ప్రథమ తరంగము

2. ,, ద్వితీయ తరంగము

3, ఉత్తర దిగంగన

4. గర్వితకన్య

5. ప్రవాసి

శ్రీ గణేశాయ నమః.

శ్రీరస్తు.

# విషయవాహిని

## ప్రథమ తరంగము

క. విషయోపభోగ వాంఛా
విషమచరిత్రంబు మనసు విధికృతిఁ దాను
న్విషదాత్మలబ్ధియై య
వ్విషయపరంపర మనంబు వివశము సేయున్. 1

క. తారతర విషయవాహిని
తారయనం బరగు లేమ తత్పతియై చె
న్నారు బృహస్పతి ధిషణుం
డారయ మానసము చంద్రుఁ డని యిబ్భంగిన్. 2

క. తొల్లింటి మహర్షులు దమ
యుల్లంబుల వాని చంద మూహించి వివే
కోల్లసితబుద్ధి నొకకథ
యల్లిరి రూపకవిధా సమంచితలీలన్. 3

క. ఆ కథయ మూలముగఁ దగఁ
గైకొని లోకోచిత ప్రకారంబున నే
నీ కావ్యము సరసవచ
శ్రీ కమనీయంబుగా రచింపఁ గడగితిన్. 4

సీ. అంగిరస్తనయు మధ్యముఁడు దివ్యత్తప
స్స్వాధ్యాయరతుఁ డుపాధ్యాయవరుఁడు
నిఖిల విద్యానిధి నిరుపమ ప్రతిభా వి
భాసి నానాధర్మపారగుండు
మహిత తేజుఁడు రూప మధురిమాధఃకృత
కుసుమాయుధుఁడు కళా కోవిదుండు
శాంతిదాంతియుతుండు సచ్చరిత్రుఁడు యశః
శాలి త్రిలోకైక సమ్మతుండు

గీ. ఘనవిభూతి బృహస్పతి యను మహర్షి
తన గృహస్థత తారాభిధానయైన
సుందరీమణివలన విశ్రుతి వహింప
నుండు నొక యాశ్రమమున శిష్యులును దాను. 5

గీ. అత్రిమునిపుత్రుఁ డమల తేజోన్వితుండు
మధురతరమూర్తి సుకుమార మానసుండు
సముదితోదిత యౌవనశాలి యతని
యొద్దఁ జంద్రుండు శిష్యుఁడై యుండె భక్తి. 6

వ. అవ్వాచస్పతియు నతని యత్యద్భుత ప్రతిభావిశేష శుశ్రూ
షాదరంబులవలనం గలిగిన నిజపరితోషంబున కనురూపం
బుగా నెల్లవిద్యల సుశిక్షితుం జేసి యుపనిషద్రహస్యంబు
లెఱింగించు వేడ్క నింకను దనయొద్ద నుంచుకొని యుండు
నా సమయంబున. 7

గీ. అమరపతి యేక వార్షికంబైన యొక్క-
క్రతువుసేయింప వేడినకతన నతని
ప్రోలి కేగెడు వాఁడయి పొలఁతి నింట
నొంటి నుంపంగ వలయుటయును దలంచి. 8

వ. అద్ధిషణుండు నిజధిషణావిశేషంబున నించుక విచారించి గృహాగృహిణీ పరిరక్షణంబునకు సుసమర్థుండును, సువిశ్వసనీయుండును నగు చంద్రుం డుండఁ గొంతయుండునే యని నిశ్చయించి యప్పని యతని కప్పగించి నిజవియోగ దోదూయమాన మానసయైన ప్రోయాలి నోదార్చి స్వపుత్ర నిర్విశేషుండగు నద్దోషాకరు ననుమతి వడసి తదితర శిష్యగణపరివృతుండై చనిమె నయ్యనంతరంబ. 9

గీ. పతివియోగార్తయయ్యు నప్పడఁతి మిన్న
ధృతి బలంబున వసుధ నప్రతిమ యగుట
తన మనసు దాన యూరార్చికొని యభిన్న
వర్తనంబున నుండె సత్కీర్తి వెలయ. 10

క. అసదృశరూపోజ్జ్వలయును
రసవద్వచనయు మనోహర విలాసియునై
యెసఁగు గురుపత్ని సొబగున
వసమటి చందురుఁడు స్మరవివశుఁడై మదిలోన్. 11

క. కడుఁ బొగులుచు నెడనెడఁ దన
యెడద వివేకంబువాడమ నిది గాదనుచున్
సుడివడుచు మదను బెడిదపు
టడిదపు బలువ్రేటువడి భయంపడి వగచున్. 12

గీ. గురుని యిల్లాలు పతిభక్తి నిరత శుభచ
రిత్ర యని ముజ్జగములఁ గీర్తిప్రతిష్ఠ
లందినది గాని యనదుగా దకట యిట్టి
దుర్లభస్థానమున నిట్టి దుడుకు దగునె.

సీ. శిష్యుండు సుతనిర్విశేషుఁ డీతండను
నమ్మిక నిం దుంచినాఁడు గురుఁడు
చెడుబుద్ధు లెఱుఁగని పడుచుఁ గుఱ్ఱండని
చన విచ్చుచున్న దాచార్యపత్ని
త్రిగుణాతిగాతి ప్రతీత నిత్యతపోని
ధాన మస్మత్పితృదైవతంబు
ముగురుమూర్తుల బిడ్డలుగఁ బెంచి చన్నియఁ
గన్న ధన్యచరిత్ర కన్నతల్లి

గీ. యకట నను వంటివానికి నట్టెయిట్టి
బహుతర ప్రత్యవాయ దుర్భరము దుర్ల
భంబుఁ బ్రతిషిద్ధము నైన భవ్యవిషయ
మున మనోభవ చాపలం బని కలంగు.

గీ. తత్తదింద్రియంబు దనతన విషయంబు
నందు మెలఁగ రాగమైనఁబొడము
ద్వేషమైనఁ గలుగు ధృతిన య్యారిద్వయం
బునకు లొంగకునికి బుద్ధి తెఱుఁగు.

చ. అనితలపోయు నింద్రియ సమూహ్రాతికిం జతనంబు సేయునె
మ్మనమవశంబుగాఁగఁగడుప్రమాన్వుడుఁ దత్స్వవశీకృతిక్రియా
జనకములంచు నయ్యుపనిష ద్వచనంబులు పెక్కుసూచుఁన
మ్మననము నిల్వనీని బలుతాపమునంబెగడందునిచ్చలున్.

వ. ఇట్లు వికలహృదయుండై నవయుచుండియు నమ్మునికుమా
రుండు సాహసంబునకుఁ జొరం జాలక శిక్షాపాటవంబునం
జేసి వెండియుఁ దనమనంబున

క. కామక్రోధము లత్యు
ద్దామ రజస్సంభవము లుదగ్రంబులు శి
క్షామహిమ మెల్ల నిమిషము
లో మటు మాయంబు సేసి లోఁగొనుచుండున్. 18

క. అమితాశనములు పాపి
ష్ఠము విష్టముగాని దుర్వ్యసనములలో ని
త్యము బలిమిఁ దోయు నతిదు
ర్దమ శత్రువు లిట్టివానిఁ దలగందగదే. 19

గీ. మలముచే ముకురంబు ధూమంబుచేత
ననల ముల్బముచే గర్భ మావరింపఁ
బడు తెఱంగున జ్ఞాన మెప్పుడును నీ ద్వ
యంబుచే నావృతంబగునండ్రు బుధులు. 20

గీ. ఇంద్రియములు మనోబుద్ధు లింతవట్టు
దనకు నాశ్రయములుగఁ దత్స్వహాచర్య
కలనఁ గామంబు జ్ఞానంబుఁ గప్పిపుచ్చి
దేహి సంమోహితుని జేసి తెరలవైచు. 21

గీ. కానఁ దొలుఁదొల్త నింద్రియగణము నిగ్ర
హింపఁగాబోలుఁ బిదప జయింపవచ్చు
జ్ఞానవిజ్ఞాన నాశకంబైన యట్టి
పాపపుం గామమును సులభముగ ననుచు. 22

సీ. తేనియ లొలుకు నమ్మానినీమణి పల్కు-
వీనులు సోకకుండ వెడలఁ బాఱు
నభిరామమైన యయ్యంగన మైఁదీగ
దటిఁజేరనీక యుద్దవిడిఁ దొలఁగు
కడునొప్పు నయ్యింతి ఘననితంబాభోగ
మెగఁబ్రాకనీక చూపిగ్గి పట్టు
చవు లుట్టిపడు నా మునివధూటిచేతి వం
టక మఱుగుడుపుతోడన త్యజించు

గీ. గమగమలు మించు నా సరోజముఖివదన
సౌరభంబులు నాసికఁ జేరకుండ
బ్రిక్క-కు మలంగి నిలుచు నప్పుడస్మవైరి
స్మరవిజయవాంఛ ఘనతపశ్చర్యఁ బూని. 23

మ. అకలంక ప్రతిభావిశేషమున నయ్యబ్జారి యూహించి త
న్మకరాంకోద్ధతి దీనఁ దీఱునని నేమంబొప్ప నేయే ప్రయ
త్నకలాపం బొనరించె నయ్యది సముద్యత్కామవేగంబునన్
సికతాసేతువు నిమ్నగారయమునం జెడ్డట్టులై వీగినన్. 24

క. మదనోన్మాద వశంబున
మది దలక్రిందగుచు మరల మగువ తనూసం
పదఁ దలఁచి తలఁచి లోలో
గుదులుకొనుంగాని తెగువకుం జొర వెఱచున్. 25

క. నానాటి కిట్లు మానని
సూన శరగ్లాని నొడలు స్రుక్కి కృశింపం
గా నతని తెఱఁగు మదిలోఁ
దానెఱిఁగియు నెగ్గులాడఁ దలఁపక చెలియున్. 26

గీ. ఊఱకుండెఁ బ్రౌఢయును నిర్భయ స్వభా
వయును శిష్యవత్సలయును గాన
దాన స్వానుకూలతా వర్తనానుమా
నంబు వొడమి యలరు నలినవైరి. 27

వ. ఐనను దనమనోభావంబులు వెలి నిగుడనీక శాలీనతా విశే
షంబున నెట్టకేలకు నెట్టికొని కాలంబు గడపుచు నచ్చం
దురుం డెప్పటి యట్ల యామెకు వినయంబు సేయుచు
విహితకృత్యంబుల యెడ నప్రమత్తుండై యగ్న్యగార పరి
రక్షణంబు సేమఱక యుండె నిట్లు కొంతకాలంబు సనుటయు
నక్కాంత నిజస్వాంతంబున నొక్కనాఁడు. 28

గీ. ఎట్టకేలకు ధృతిబల్మి నిన్నినాళ్లు
ధవవియోగార్తి సైరించు దాన నైతి
కటకటా యాఱునెల లిట్లు గడపవలయుఁ
బలుకుఁ దోడైన లేని దిష్ప్రాడుకొంప. 29

గీ. దినము యుగమునకంటెను దీర్ఘమయ్యెఁ
బొద్దు వోవద యొరులేరు నొద్దలేమిఁ
జందురుఁ డున్నాఁడుగాని తత్సన్నిధాన
మవమతికి లోకనిందకు నాస్పదంబు. 30

గీ. అయిన సైరించికొందుఁ బొమ్మందునేని
యతఁడు మద్విషయాభిలాషావిలాత్ముఁ
డిచ్చమెయి వానితోఁ బొద్దు వుచ్చుకొనుట
కుచ్చితపుఁ జెయ్దముల కెడ మిచ్చికొనుట. 31

క. అని యిట్లు పెక్కుతెఱఁగుల
మనమునఁ దలపోసి యతని మది రాఁగొని య
ల్లన బుద్ధిఁ గఱపి పిమ్మట
నను దగ నెఱిఁగించుకొని చనవు గల్పింతున్. 32

గీ. అందు నానేర్చుమాటల పొందువలన
విడువ నొల్లని శిష్యుఁ గావించుకొందు
నింతకంటె నుపాయ మిం కేమివలయు
నేర్తుఁ బొమ్మని తరలాక్షి నిశ్చయించి. 33

వ. అ మ్మునికుమారుండు సాయంసమయకృత్యంబులు నిర్వ
ర్తించుకొని వచ్చునంతకు నభినవరసోదారంబులగు నాహా

రంబులు సమకూర్చి యతని రాకయ వార్చి యున్నయది. గావునఁ దన యపూర్వవర్తనంబు వాని డెందంబునకు సందియంబు నాపాదింపఁ బ్రత్యుత్థానంబుసేసి లోనికిం గొనిపోయి యొక్క రమ్యప్రదేశంబున. 34

గీ. ప్రీతి వెలయంగ నొకపెద్ద పీటవెట్టి
పతి మును భుజించు బంగారు పళ్లెరమునఁ
బేర్మి దోపంగ బోసేయఁబెట్టి యతడు
గుడిచి కూర్చుండి యున్నెడఁ గువలయాక్షి. 35

క. తానును సాపడి శుభపరి
ధానము గట్టుకొని ప్రేమ దళుకొత్తంగా
మానీంద్రతనయుఁ డుండెడు
నా నెలవున కరుగుఁదెంచి యల వేర్పడఁగన్. 36

క. కొండొక నెపమున వీనుల
పండువుగా మాటలాడి భామామణి య
ప్పండితసుతుఁ బడకింటికిఁ
గొండికనుంబోలెఁ దీసికొని చని వేడ్కన్. 37

వ. తన పర్యంకంబున కాసన్నంబై యున్న యొక్క సుఖాసనంబున నాసీనుం గావించి తానునుం దన పడకసేరి మందహాస మధురం బగు నిజ వదనారవిందబునం దోచు నాక్రొత్త యందం బతని డెందంబున కమందానందంబు గల్పింప నల్లన యిట్లనియె. 38

గీ. అకట! గురుఁడులేని యద నని యెఱిఁగి యే
నొంటి సెజ్జ నిట్టు లుండు టెఱిఁగి
యాదరంబు దోప నరయ రా వెన్నండు
మునికుమార! యింత ముగ్ధుఁ డగుదె. 39

వ. అనుటయు నతండు దనమనంబునం బ్రియంబును భయంబును
సంశయంబునుం బెనంగొన నుత్సుకుం డయ్యు హృదయ
గోపనంబును వృత్తరక్షణపరతయుం దేటపడ నవ్వాలందుక
కిట్లనియె. 40

క. మగవారులేని యింటను
మగువలు దా నొంటినుండ మముబోఁటులకుం
దగ వగునె యరయ వచ్చుట
నగరే యిది యెఱుఁగినను బుణ్యవతీ! 41

గీ. తల్లియనుబోలె వర్తింప దగినదాన
వింత యెకసక్కెముగ మాట లేల విడిచె
దకట! యీ కొ్రత్తచర్య లత్యద్భుతములు
లలన! యతివినయము ధూర్త లక్షణంబు. 42

క. అనుటయు నవికృతమతియై
వనితామణి తొంటియట్ల వదనము చిఱున
వ్వున నందమంద నాతని
గనుఁగొని యిట్లనియెఁ దన ప్రగల్భత దోపన్. 43

గీ. దైవఘటన మున్నఁ దల్లి నే నగుటెంత
యరయ నీవు కొడుక వగుట యెంత
గాని యేల యింత కలఁక సెందితి చెప్పు
మయ్య! తెలిసికొనుట కర్త నగుదు. 44

క. మగవారు లేని యింటను
మగువయ తానొంటి నున్న మదలోభ విమో
హ గరిష్ఠు లైన దుష్టుల
కగు నది సమయంబు మానహరణాదులకున్. 45

వ. కావున నాత్మరక్షణంబు నగార రక్షణంబునుం గోరి పురుషుం
డవుఁ బుణ్యశీలుండవు నగుదని నీయాదరంబు నరయక యు
నుండ వేడితి నింతియకదా నాయపరాధంబు. 46

గీ. తల్లియును బోలె వర్తింపఁ దగిన దాన
వని హితం బుపదేశించి తంతెకాని
కొడుకునుం బోలె నుండక కుచ్చితంపుఁ
బలుకు పలికితి విది యేటి పథము చెపుమ. 47

క. మగఁ డింట లేక యొక్కటి
మగువయ కలయింటఁ దత్కుమారునకును దా
నగపాటు గూడ దని యిటు
దెగఁజెప్పితి దీన నీ యధీరత దెలిసెన్. 48

సీ. యువతి మాత్రముగ న న్నుల్లమందుఁ దలంచి
తల్లియపోలె వర్తిల్లు మంటి
తరుణ మాత్రునిగ నిఁక దలఁచి యే నుందుఁ బో
తనయు నట్లు మెలంగఁ దగదె నీకు
కటకటా ! నీ తప్పుగానక నన్నంటి
వెఱుఁగ నీమదిలోని తెఱఁగుఁ జెపుమ
మనసు తత్తఱ మాపికొన లేక పలికెదో
ననుఁగాన నది వెరవని తలఁచితొ
గీ. శాంతియును దాంతి గల బుద్ధిశాలి వనుచు
నాత్మరక్షణ మెదఁగోరి యరయు మంటి
నీ మనసు నీవ యిటు నమ్మ నేరవేని
యేను నమ్మి చరించు టింకెట్టు లొక్కొ. 49

వ. నీవు నా నిర్దేశించిన తెఱంగున మెలంగుచుందువేని యెవ్వరి కే యపాయం బెట్లు సంప్రాప్తం బగునని శంకించెదు ? నీ తలంపేమి ? నిక్కంబు సెప్పు మేను నీ చిత్తం బెఱింగికొని తగువిధంబున వర్తింపం గోరెద నని మాటల జంకించియుం బ్రసాదమేదురం బగు తన యపాంగావలోకం బమ్మునికుమారు మొగంబుపై నిగుడ నూఱకున్న యన్నలినాక్షి మనోవర్తనం బెఱుంగంజాలక యెట్టి ప్రత్యుత్తరం బీయను వెరవు గానక కొంత చింతించి విషణ్ణవదనుండై యతం డిట్లనియె. 50

క. జ్ఞానలవ దుర్విదగ్ధత
నే నేమో మదిఁ దలంచి యిది హితమని నీ
గాన కటు లంటి నది త
పైనను శమియింపు మమ్మ యక్కటికమునన్. 51

వ. అయినను నా యాడిన పలుకుల భావంబు విన్నవించెద సావధాన చిత్తవై విను మని సవినయంబుగా నమ్మని పుత్రుం డు వెండియు.

క. సవినయవర్తనమున వే
షవిశేషాడంబరమున సరసోక్తుల నీ
నవనవ దరహాసోద్గమ
సవిలాస ముఖాంబుజమున సందియ మగుడున్. 53

క. యువసందర్శన జాతో
త్సవలగు జవరాండ్రికవియ జాడ లగుట నీ
తవు లూహించితిఁ గాని దు
రవధేయము నీదు హృదయ మది పరికింపన్. 54

వ. అది యట్లుండ నిమ్మ నేను నీ యాడిన పలుకులం దొక్క యెడ నొక్కసందియంబు నొందితి దాని యాంతరం బరయు వాఁడనై యడుగుచున్న వాఁడ నొండు దలంపక యందుల కేమి యుత్తరం బిచ్చెద విమ్మని మఱియును. 55

గీ. దైవఘటన యున్నఁదల్లి నేనగు టెంత
యరయ నీవుఁ గొడుక వగుట యెంత
యంటి దానిభావ మరయ వేరైనది
యట్టు లేల పలికి తమ్మ నీవు? 56

వ. నీవు మద్గురు పత్నివిగావునం దల్లివయై యున్నదాన వేల
దైవఘటనంబు దడవితి నావుడు నగ్గురుపత్ని యమ్ముని
కుమారున కించుక పరిహాసంబు దోఁప సదరహాస మధు
రంబుగా నిట్లనియె. 57

గీ. తల్లియును బోలె వర్తింపఁ దగిన దాన
వంటి వంతియ కాని మాయమ్మ వనవు
నిన్నుఁ బుత్త్రునిగాఁ గాంచు నెలత నైనఁ
గాక యేఁ దల్లి నగు టెట్లు నీకుఁ జెపుమ. 58

గీ. తాన తనయుఁ డగుచుఁ దల్లి గర్భము సొచ్చుఁ
బురుషుఁ డనెడు శ్రుతులఁ బ్రోదిసేసి
యట్టు లంటిఁ జూవె యన్యమేమియుఁ గాదు
దైవఘటన యున్నఁ దప్పఁ దరమె. 59

క. వల దను నిషేధమున్నను
బలిమిం డెందంబు చిక్కఁబట్టి నిలిచినం
జలముకొని తొలఁగినను గాఁ
గల కార్యము లెట్లు తప్పఁ గలుగుం జెపుమా. 60

క. ఏ పొలమున నే బీజం
బే పగిదిం జేరి యెటు ప్రవృద్ధం బగునో
యూహింప నేరితరమగు
నోపుదుమే దైవశక్తి నొగిఁ దప్పింపన్. 61

గీ. తొల్లి యుద్దాలకుఁడు ముని తల్లజుండు
శ్వేతకేతుం డనెడువాని శిష్యువలన
నిజకళత్రము నంద యాత్మజునిగాఁగ
బడసె నందురు వినవె తాపసకుమార! 62

వ. అట్లగుటం జేసి దైవచేష్టితంబులు దుర్విజ్ఞేయంబులు విషయ లాభంబులు కేవలదైవాధీనంబులు నని యెఱుంగు దానం గాన నదియంతయు నీమాటల వరుసన మనంబునకుందోచిన నట్లంటింగాని యొండేమియుంగాదు కలంగకు మనుటయు నక్కుమారుండు. 63

గీ. ఏను నీదు మనోమర్మ మెఱుఁగ నోప
గేలి సేయకు మే నిన్ను గెలువఁజాల
దైవచేష్టితముల కేల తడవవలయు
సుదతి గురుపత్ని వీవు శిష్యుండ నేను. 64

క. గురు నాజ్ఞఁ దత్ప్రయోజన
పరతం గురుతల్పగమన, పాపమువోఁ ద
ద్గురునకయి శిష్యుఁడమ్మోయి
వరపుత్రికు శ్వేతకేతు వెడసి యొసంగెన్. 65

వ. అట్టియుదాహరణంబులేల యిప్పట్టునం దడవవలయుఁ దొల్లి వేదుం డనం బరగు వేదవేదాంగనిధి యొకానొక సమయంబున యాజ్యకార్యంబున స్థలాంతరంబున కరుగువాఁడై యుదంకాభిధానుండగు నిజశిష్యుం బిలిచి యతనితోడ. 66

గీ. ఏను లేనివేళ నే యే క్రియాకలా
పంబు దప్పు మద్గృహంబునందు
దాని దానిఁ బ్రీతి దప్పకుండంగఁ గా
వింపు మనుచుఁ జెప్పి వెడలి చనియె. 67

సీ. అంత నుదంకుఁ డయ్యాచార్యునానతిఁ
దలఁదాల్చి శుశ్రూషతా విశేష
మెంతయు నొప్ప వర్తించుచో నొక్కనాఁ
డయ్యుపాధ్యాయుని యతివలెల్ల
నొక్కెడఁ గూడి శిష్యుని బిల్చి భవదుపా
ధ్యాయాని ఋతుమతి యయ్యెఁ జూవె
పతి పరదేశసంగతుఁ డౌట వగచుచు
న్నదిగాన ఋతు వవంధ్యముగఁ జేయు

గీ. మనుటయు నతండు వారలఁ గని యిదేటి
మాట వనితలు సెప్పు నిమ్మాట కతన
నీ యకార్యంబు సేయుదునే గురుం డ
కార్యమైనను జేయ నాజ్ఞ యిడఁ డెపుడు. 68

వ. అని యమ్మాటలు గీటునం బుచ్చి యయ్యకార్యంబు సేయక యాచార్యప్రియుండై వర్తించె నట్లగుటం జేసి శిష్టాచారంబు లగు నీ దృశంబు లుదాహార్యంబులు గాని మనబోంట్ల కన్యంబులు దడవం గొఱగావు సూవె యనుటయు న య్యండజయాన వెండియు. 69

చ. అనఘచరిత్ర! నాతలఁపు నట్టిద దానినపట్టియుండ మై
నను వసమయ్యె దైవఘటనల్ పొరివుచ్చఁగ సాధువర్తనం
బున జరియించు యత్నముడి వోకకు నోపమకాక యెవ్వరే
ననితరసాధ్యమైన పనియందు నశక్తులె యెల్లభంగులన్. 70

గీ. అనుచు ననుబంధ కల్పన మావహించి
వెలఁది తన్మానసంబెల్ల వెలికిదీయు
దానఁగా కను తలఁపున వానిఁ జూచి
యల్లనల్లన నగుచు ని ట్లనియె మఱియు. 71

సీ. ఉదధి యున్నపుడ వాయువు సోకు దప్పమిఁ
దరగ చాల్పొడమక తప్ప దెట్టు
లట్టుల మనసున్న యపుడులోలత కల్మిఁ
దలఁపులు పొడమక తప్ప వెందుఁ
బుట్టుఁబోవు నొకప్డు కట్టడ లొండొండ
బలితంబు లగునేని భావవితతి
విషయ సాన్నిధ్యంబు విఱివిదై పాయక
యుండుచోఁ దద్వేగ ముడుపరాదు

గీ॥ కలరె క్షుత్పిపాస లొలసి లో నెఱియింప
నెదుటనున్న యన్న మేవగించు
బలిమి చిత్తములకు గలవార లెందును
వాయి కొంత గట్ట వచ్చుఁగాక. 72

క. అట్టి మనఃపీడక మగు
కట్టువలన నొండు మేలు గలదే మది దా
నొట్టుం జెడనే చెడినది
కట్టడ దప్పిన ఫలంబు గలుగదె యింకన్. 73

చ. అనుటయు నతి ప్రియోక్తి వనజాయతలోచనఁ గాంచి బాహ్యవ
ర్తనములు సక్కఁ బెట్టుకొను ధైర్యముగోల్పడకున్న జాలు నె
మ్మనమింక నేమి సేయు బలు మాటలులోపల నూఱుగాక తా
మునియగు నేని దుష్ఫలము ముట్టుటకుం దెరువెద్ది సెప్పుమా. 

క. నావుడు వేఱొక తెఱఁగున
భావింపకుమయ్య! వాద పాటవమునకై
నీవును నేనును దృష్టాం
తావస్థితిఁ బొంది మాటలాడుద మిచ్చోన్. 75

క. నిను నే వలచితి ననుకొను
మనఘా! నను నీవు వలచి తనుకొందము వ
ర్తనశుద్ధి తప్పి చనదో
చనునో తెలియంగ వాదు సాగింత మిఁకన్. 76

వ. అందుఁ దొలుత మనవలపు స్వాభావికం బగుట నిరూపించెద వినుము.

ఆ. వె. చెలువుఁ డిల్లు విడిచి నెలలాఱు సనియె నే
దరుణిఁగాని ముదుకదానఁ గాను
జవ్వనంబు రూపసంపత్తిగల ముద్దు
లాఁడ వింటఁదగ మెలంగుచుందు. 77

వ. ఇది నా తెఱంగు నీ తెఱంగును నేనచెప్పెద నవహితుం డవై వినుము.

క. సలలిత శుభ యౌవనకృత
విలసనములు లోనమేన విచ్చలవిడిగా
నొలసినవి యొంటి నింటం
గల దొక జవరాలు కన్నుఁగవ దనుపారన్. 79

వ. ఇట్టి యేకాంతంబును నేటితోడం దీరునదిగాక యేకరూపం బున నింకనుం బెద్దకాలంబుండఁ గలయది యిప్పట్టున మన మెట్టు వర్తించి యోగ్యవర్తనుల మై యుందము నీవ నిర్ణ యించి చెప్పుము నావుడు- నాఋషిపుత్రుం డామెతోడ.

క. అతిసమాన శీలవై నీ
పతివ్రతాత్వంబు వెడలఁ బాఱక యుండం
జతురగతి మెలఁగు చుండుట
హితమును ధర్మంబు సువ్వె యెల్ల తెఱఁగులన్. 81

క. విద్యావినోదకలనా
సద్యోవినివృత్తకామ సంచారుఁడనై
హృద్యగతి బ్రహ్మచర్యము
నుద్యోతము సేత నాకు నుఱవెబ్బంగిన్. 82

వ. పతివ్రతాత్వ బ్రహ్మచర్యంబుల స్వరూపంబెట్టి దంటేని.

క. పరపురుషుఁ దాక కున్కియె
తరుణీ రత్నమ ! పతివ్రతాత్వం బనఁగాఁ
దరుణీ స్పర్శన దూరీ
కరణమె భువి బ్రహ్మచర్య కలన యనంగన్. 83

వ. మనశ్చాంచల్యంబు దుర్నివారం బగు పట్టున దిట్టతనంబుం బూని దాని బహిర్వ్యాపారంబు లరికట్టు టొక్కండు దక్క ధర్మరక్షణంబున కొండొక్క మార్గంబు గానరాదు. కేవల మనోవ్యాపారంబు లధర్మక్రియాఫలంబు నీనోపవని యతం డూఱకుంటయు నమ్మచ్చెకంటి యతనిం గ్రొల్గంట విలోకించుచు నందులకుఁ దన ప్రతివాదంబుగా నిట్లనియె.

ఆ. వె. మనసు ప్రోత్సహింప మాటలు చేతలు
దమకుఁ దాము వెడలుఁ దఱి యెఱింగి
వానివలన బాహ్యవస్తు లాభాలాభ
వర్తనములు బయలువడుచు నుండు. 85

క. ఆ లాభాలాభములకు
నోలిఁ బ్రమోదంబు ఖేద మొందక యుండం
జాలఁడు నరుఁ డది విధ్యను
కూలప్రతికూలగతులకుం జాడఁ జుమీ. 86

క. కావున మన సెబ్భంగిం
దావలచిన యట్లచేయ దక్షమ యటుపై
దైవానుకూల ముండుం
బో వాంఛితఫలము దప్పిపోవక కలుగున్. 87

గీ. ఎడద పరపురుషాసక్తి నడరునేని\
దఱియెఱింగి మాటలాడించుఁ దానవ్వాని\
వర్తనం బెల్ల నది యెట్లు వలచె నట్ల\
నడచు చుండును ననువర్తనంబు వెలయ. 88

గీ. నెమ్మనము చెడినష్ట యిన్నియును జెడియెఁ\
గలుగు నొండెను ఫలసిద్ధి గలుగ దొండె\
దైవశక్తిని దప్పినఁ దప్పఁగాక\
దానఁ దనకుఁ బతివ్రతాత్వంబు గలదె. 89

క. తనువలచెడునది లేకయొ\
యనువగు సమయంబు దొరక నందుననొ పరాం\
గనపొందు వడయవేనియుఁ\
జనకుండునె నీదు బ్రహ్మచర్యము చెపుమా. 90

గీ. చెప్పఁజాలవేని చిత్తశుద్ధియె యెందు\
ధర్మమునకుఁ దగు నిదానమనుము\
బాహ్యాభయనిరాస ఫలమాత్ర పర్యవ\
సానకలన యనుము సహాన మనఁగ. 91

వ. ఇట్టిది కేవల మాత్మరక్షణంబున కుపాయమాత్రం బగుటం\
జేసి నీతి యనం బరగు నింతియకాని దీనం గలుగు ధర్మం\
బెద్దియు నుండ దింక నీవాదం బెయ్యది నావుడు నతండు.92

ఆ. వె. పరుల వలని తీవ్రభయమునఁ గాక ధ
ర్మ ప్రవృత్తి పొందు మఱఁగ వేఁడి
మనసు నెల్లవిఘ్నుల మర్దించు టొప్పదే
దాన ధర్మరక్ష దలకొనంగ.

క. నావుడు నది యట్టిదపో
వేవిధముల నట్టిచేత వెరవగునైనన్
నీ వలచినట్లు మనసది
పోవుట సులభంబుగాదు భూసురతనయా!

గీ. మనసుచంచల మత్యంత మథన శీల
మతి బలీయంబు దృఢతమం బప్రధృష్య
మనఘ! యద్దాని నిగ్రహం బనఁగ వాయు
నిగ్రహమువోలెఁగాని పనియె నిజంబు.

గీ. అది రజోగుణమూర్తి యట్లగుటె కాక
మఱి రజస్సంభవంబు కామంబు దానిఁ
బాదివికొని నిల్వఁగెల్వ నీబోఁటివాని
కెంత దుస్సాధమగునొ యూహింపవలదె.

గీ. గుణములు స్వభావజములు తద్గుణములందు
విను రజోగుణ మత్యంత ఘనతరంబు
దాని దొలఁగించికొనుట సాధ్యంబు సుమ్మె
మహి స్వభావంబు దురతిక్రమంబునారె.

వ. కావున మనోమర్దనంబు సుకరంబని తలంపకు మది బహు
తపస్సాధ్యంబు నినుబోంట్ల కయ్యది యసాధ్యంబైన కార్యం
బందును దైవవిలాసంబు లతి విచిత్రంబు లెట్లంటేని
వినుము. 98

గీ. కనుల కగపడ రూపంబు గలదిగాదు
చెవికి వినఁబడ మాటలు చెప్పుచుండ
దార కంటికి దానకన్నగుచుఁ జెవికిఁ
దాన చెవియును నగుచుండు దైవమెపుడు. 99

గీ. దేనికేయది విషయంబు దానియెదుటఁ
బూని దానినపెట్టి తద్భోగకలన
కడ్డులన్నియుఁ దొలఁగించి యాటలాడు
సారిది నంతశ్చరము బహిశ్చరమునగుచు. 100

క. కాన మనోమర్దన పర
తానిపుణత సాగనీదు దైవము నరు ధై
ర్యానూనతఁ దెలియఁ బరీ
క్షానిరతిం బూనినపుడు సత్యమసుమ్మా. 101

వ. అట్టి చలపాదియైనది దైవంబంత దురతిక్రమంబైనది
స్వభావం బవ్విధంబున నతిదుర్జయంబైన దమ్మనంబు నీవు
బాలుండవు విలోలస్వభావుండవు నీకవి లొంగంగల
యవియే యని వెండియు. 102

గీ. సకల సంకల్పజాతంబు సంహరించి
ధీరులు మనంబుతోడి యొద్దికవహింతురి
విసపుఁగోరలు మునుదీసివేసి కాక
పాము నహితుండికుండు లోఁబఱిచికొనునె. 103

గీ. విఱుపులన్నియు నెఱిఁగి మున్విఱిచి పిదపఁ
బ్రాజ్ఞుఁడగువాఁడు మర్దించుఁ బాదరసము
వెరవులెవ్వియుఁ దచ్ఛక్తి విఱువనెఱుఁగ
కెట్లు మర్దింతు మనసు నాకెఱుఁగఁ జెపుమ. 104

మ. మతిమంతుల్ స్వమనోజయంబునకు నేమంబొప్పవైరాగ్యముల్
సతతాభ్యాసము సాధనంబులుగ నిచ్చంబూని సాధింతు రు
ద్ధతకల్లోలిని నిష్టదేశ సముపాత్తంజేయఁ దత్సేతు ని
ర్మితియుంగాలువఁ ద్రివ్వ పెట్టులటుసుమ్మీ దానికక్కార్యమున్.

వ. అని తదభిప్రేతంబగు మనోమర్దనంబున కుపాయం బాదే
శించినదియై యగ్గురుపత్ని యొండు కర్జంబు దలపోసి యంత
టితో నుడుగక యోయీ, నీయుపాయ జ్ఞానంబు నా యెఱుం
గనియదిగాదు మనబోంట్లు తాదృశంబులగు మహా వ్యవ
సాయంబుల నేమి సాధింపంజాలుదు రది యట్లుండనిమ్ము.
నీ యోటమి కంగీకరింపుము. మన కిప్పట్టున నెట్టివర్తనంబు
యోగ్యంబై యుండుననియెడు నా ప్రశ్నంబు దొల్లింటి
యట్ల నిలిచియున్నదిగదా, మఱియ నీ వప్పుడు నామనో
వర్తనంబునెడసంశయించి యడిగిన యొక్క ప్రశ్నంబునుం
గలదు చెప్పెద వినుము. 106

క. యువసందర్శన జాతో
త్సవలగు జవరాండ్రికుందు జాడలు గని నా
తవులూహించితి నని ము
న్నవనీసురవర కుమార యంటివకాదే. 107

గీ. యువతులకు నెందు యువదర్శనోత్సవంబు
కామ వృత్తి కసామాన్య కారణంబు
నీకు నాయెడనింక సందేహమేల
రాతి బొమ్మనె యే జవరాలఁగాక. 108

వ. అచక్షుర్గోచరంబగు హవ్యవాహను కలిమికి ధూమంబెట్టు లట్టుల నామనోభావంబుల యున్నరూపు నిశ్చయించి కొన నసాధారణలింగంబు లెన్నివలయు నన్నియు నీకాంచి నవియ. 109

సీ. అర్హుండవని మెచ్చి యాతిథ్య మొసఁగితి
రూపసి వనుచు వాల్పూపులిడితి
సమవయస్కుఁడవంచు సఖ్యంబు నెరపితి
వలతని శుభవేషకలిత నైతి
సుకుమారుఁడవటంచు సుమశయ్యఁ బెట్టితి
నలరుఁగాకని సస్మితాస్య నైతి
మేటి జాణవయంచు మేలంబు లాడితి
గోరియుండని యొద్దఁ గూరుచుంటి

గీ. విడిచిపోనీక మాటలు వెట్టుకొంటి
మనసుఁదెలుపుదువని యింత మరులుకొంటి
నిట్టిచేతలు మున్నెన్నఁ డీవు గంటి
వెఱఁగి సంశయపడితి నం చెట్టులంటి. 110

వ. నాచందంబు నీయూహించినట్లు కానిమ్ము. నీడెందం బే నెఱుంగనని తలంపకు మరియుం జెప్పెద వినుము. 111

క. యువతి విలోకనజాతో
త్సవులగు యువకులకు గలుగు జాడలు నీయం
దవలీల మున్న కనినఁ
దవిలితి వని తెలిసియున్న దానం జుమ్మా. 112

వ. నాయీ నిశ్చయంబు నీమాటలవలననుం దేటపడి యున్న యది యజిత స్వభావులమగు మన మిద్దరము దైవ శక్తిం జేసి యిట్టి యేకాంతలాభంబు వడసి నిరర్గళ ప్రసారం బగు నీ సంసారంబునం బడి కలగుండు వడుచున్న వారమ కదా యిప్పట్టున మన మెట్లు వర్తింతము నిర్ణయించి చెప్పు మనుటయు నమ్మని శిష్యుం డయ్యువిద కిట్లనియె.

గీ. కలికి యీ రేయి నీవిట్టి పలుకు లందుఁ
జొనుప కున్నఁ బ్రమాదంబు సొరకయుండు
సేతుబంధంబు దెగఁగొట్టి చెప్పుమనిన
నేమి సెప్పుదు నింక నీవేమి విందు. 114

గీ. చనవు వలదని యేనెంత జంకుచున్నఁ
బెలుచ నింతటి చనవుఁ గల్పించికొంటి
చేరి మనసిట్టిదని విచ్చి చెప్పి నీదు
గౌరవముఁ గోలుపోయి లాఘవము గంటి. 115

వ. తొల్లి మాతృభావంబు కలిమి నానోటికిం బరిచితంబులై యున్న పూజావచనంబులు దమకుఁ దామ వీడ్కొని వాని యన్నెలవున యువతి జనసాధారణంబులు లాఘవ ప్రదంబులు నగు నవీన యవచనంబులు దోడ్తోడన వశంబులై వెడలుచున్నయవి యేమి సేయుదు నని యూఱకున్న నన్నలినానన వాని మనోవృత్తం బంతయు వెలికిఁ దీసి స్వకృత పరిభవ విశేషంబున నతనికి వైరాగ్యంబు పాదుకొల్పునదియై వెండియు నిట్లనియె. 116

క. ఇది యర్థమిది యపార్థం
బిది యుక్తం బిది యయుక్త మిది హిత మహితం
బిది యనెడు బుద్ధిగలుగునె
మదన జ్వాల దనలదహ్యమానాత్మ్ములకుఁ. 117

గీ. పూవు విల్తుని చేతి కీల్బొమ్మ యగుచుఁ
బొలఁతి యొక్కని బొందంగ బుద్ధిఁ దలఁచి
సిగ్గువోనాడినపుడు తచ్చిత్తమునకు
రమణు నేమాట లమృతాంకురములు గావు. 118

గీ. ఎఱుఁగ కిట్లంటి గౌరవం బెల్లకడల
వాంఛనీయంబ యగుఁగాని వనితకెందు
నరయఁ బ్రణయ పురస్సరంబైన లాఘ
వంబు సంబుద్ధియెడ గౌరవంబు సుమ్ము. 119

క. కలికీ! సుదతీ! యనియెడు
పలుకులు దావలచియున్న ప్రాజ్ఞుని నోటన్
వెలువడున యేని యమృతం
బొలికిన యట్లుండు నెట్టి యువతికినైనన్. 120

వ. ఇంక యువజనస్వభావం బిట్టి దగుంగాదని నిరూపింప నా కశక్యంబైనను నీచరిత్రంబు దాని కొక్కింత యవలంబం బయ్యెడు నీ వెంత డాచికొనినను నీహృదయ దౌర్బల్యం బేనెఱుంగని దాన ననుకొంటివి కాఁబోలు వినుము. 121

సీ. తతనితంబాభోగ దర్శనాకాంక్షివై
వినువక పలుమాఱు వెనుకఁ జూతు
నవసుధామధుర వాఙ్నివహ పూరాసక్తి
శ్రవణ శష్కులికలు సవదరింతు
చటులకటాక్ష వీక్షాపాత సంభ్రాంతి
వెడవెడ మొగమెత్తి వేడ్కఁ గందు
పటుపయోధర ఘటాస్ఫాల నోద్ధతికినై
తమకించి లోలోనఁ దల్లడిలుదు

గీ. గురుని కోపాగ్ని కడలుచుఁ గొన్నినాళ్లు
కుటిలత బయల్పడునోయంచుఁ గొన్నినాళ్లు
కొలఁది సాలమిఁదలపోసి కొన్నినాళ్లు
క్రుళ్లుచుండుట యేనెఱుంగుదున కాదె. 122

క. సాహసము లేక మది ను
త్సాహము చెడి నవయుచునికి దలఁచియ కాదే
యూహాసిద్ధికిఁ దగుదని
యూహించితిఁ గతి యెఱింగి యుల్లములోనన్. 123

క. తన వలపు లెట్టులున్నను
దను నొల్లనివాని కేల తాఁ జనవిచ్చున్
ననఁబోఁడి యింత యెఱుఁగక
ననుమూరెడు నీదు జంకునకుఁ గొంకుదునే. 124

ఆ. వె. ఆఱునెలలనుండి యూఱడిపోక కే
నొల్లకొక్కభంగి నునికిఁజేసి
మనసు దెలియలేక మఱఁగితి గా కాత్మ
గౌరవార్థి వగుచు నూఱకుంటె. 125

క. మదిఁ దెలియ నాయొసంగెడు
పదతాడనమైనఁ బరమభాగ్యంబనుచుం
డుదు వింతయెఱుఁగుదును నీ
కిది యెంతటి లాఘవంబొ యెఱుఁగం దగదే. 126

చ. అని మనసిచ్చి పోఁబలికి యన్నలినాయత చారునేత్రి యా
తనిఁ దగఁజూచి సాధుజనతామతశీలుఁడ వీవు నాదు వ
ర్తన మవిగర్హితంబనెదు తథ్యమెఱింగితి వేన యిప్డు నా
చనవున నిట్లు నిన్ జెఱుపసాహసవృత్తి వహించితింబలే.

గీ. తెలియఁగలవాఁడవై తెల్లతెఱఁగులందు
నామనోవర్తనంబు విన్నాణ మెసఁగ
బుద్ధిమంతుండ వగుదువు పోఁగదయ్యొ
నిదుర పొద్దయ్యె నిన్నింక నిలుపరాదు. 128

చ. అని యిటులవ్వెలందుక తదాంతరదోషము వెల్లడించుచుం
దనహృదయంబు డాచికొని తత్పరతం బ్రికటించుచున్న న
మ్మునిపతిసూతిగానక విముగ్ధత నామె సముద్ధత స్మరా
ర్తిని నటులంటకా వగచి ధీరత గోల్పడి లజ్జవీటి వోన్. 129

గీ. స్త్రీలు వక్రోక్తి చతుర లిచ్చెలి మనంబు
దెల్ల మైనది యింక భీతిల్లనేల
యని తలంచుచు నుత్థితుం డయ్యె మించు
తెగువఁ గామీ స్వాతాం పశ్యతి యన వినమె. 130

వ. ఇట్లు చివాలున నిజపీఠంబు దొఱంగిలేచి తత్పర్యంకంబు
పయింబడి యమ్మత్తకాశిని యుత్తలంబున దత్తఱపడుచున్న
నుం బోనీక నిజబాహుపాశంబునంబొదివిపట్టి యెట్టెట్టుసేయ
నట్టట్టె డిట్టగావునఁ దన్నుఁదప్పించికొని తన ప్రియత్నంబు
డుదకుఁ దనక యిట్టి యపాయంబు దెచ్చెనే యనితలం
చుచునైనను ధైర్యంబు పెంపున దైన్యంబు దోపనీక

ప్రోడతనంబు వెలయ నతనిక య్యకార్యంబు నెడ రోతవొడ మించునదియై తొలుతఁ బరిహాసంబు దోప సరసవచనం బుల నిట్లనియె. 131

ఆ. వె. బాహ్యావర్తనంబు పరిశుద్ధమై యున్న
నాత్మ యేమిసేయు నంటి తొలుత
ధర్మరక్షణైక తాత్పర్యమున మనో
మర్దనంబుసేత మఱచి తెట్లు. 132

గీ. న్యాయశాస్త్ర విశేష విన్యాస కలన
గుపితుఁ డగు హీననై య్యాయికుండు వోలె
సాధు శీలావనార్థ ప్రసంగవేళఁ
గాముకుఁడవైతి వరసికాగ్రసరవృత్తి 133

గీ. వాదమున నన్నుఁ గెల్చి పేర్వడయు దేనిఁ
జతురరతి సత్క్రియాసమున్నతిఁ జెలంగు
మోఁటమికి సిగ్గువడకిట్లు లుండు లేని
యరసికుని పొందుగోరునే యతివ యెందు. 134

వ. నీ వాదంబు నీవ చేసేతం గోలుపోయితి వంతియకాక నీయ వశత్వంబువలనను మద్వాదంబున కానుకూల్యంబు సంపా దించి పెట్టినాఁడవు నీదిట్టతనంబెల్లఁ దెల్లంబయ్యె విజితుం డవు విజయంబు వడసినవారిచే నెట్టి సత్కారంబుఁ బొందం గలుగుదు వట్టిద పొందుదువుగాక యని నిర్వికారచిత్తయై యూఱకున్న యయ్యుత్తమురాలిం జూచి సిగ్గుపడి లేచి

దూరము దొలంగి యొక్కయెడ నిలిచి విషణ్ణవదనుండై
తలవాంచియుండ నయ్యండజయాన వెండియు వానికిట్లనియె.

గీ. పరుని యిల్లాలఁ బండితపత్ని నగుదు
నుగ్రతేజుండు పతి యాతఁ డొజ్జనీకు
నమ్మి నిన్నింట నిటు లుంచినాఁడు దీని
మఱచి యిటు సేసి తిది మనోమర్దనంబె. 136

మ. తగునే యీ నను వంటిదాని యెడ నేతద్వృత్తి శాంతిక్షమా
దిగుణౌఘం బుడివోవ నిట్లు గురుపత్నింబట్ట నుంకింతురే
నగరే లోకులు నిన్ను నన్నుఁ గనినన్ నాకేశ్వరాచార్యు నె
మ్మొగ మింకెమ్మెయిఁ జూచువాఁడ వకటా! మూఢుండవై
తెంతయున్. 137

వ. అని తెగనాఁడియు నతని హృదయంబు విఱిసిపోకుండఁ బట్టు
వఱిచికొనునది యై వెండియు. 138

క. ఇది యెట్లును దప్పని దన
మది నాసిద్ధాంత కలన మన్నింతువ పో
విదితముగ నేను బనిచిన
గద యిష్టార్థంబు వడయఁగాదగు నీకున్. 139

గీ. ప్రకటభంగి నీదు ప్రతివాదమునకు సా
ధనము లుండునేమొ తడవికొనుము
తఱచి చూచి యెట్టుఁ దప్పని సరియైన
నవులఁ జూచి కొంద మట్టిపనికి. 140

క. అని లోని నగవు కనుఁగవఁ
దనుకుచు వెన్నెలలుగాయఁ దరలాక్షి గడుం
జనవుమెయి వాని డెందము
దనుపుచు నటుసూచి మఱియుఁ దా నిట్లనియెన్. 141

క. సరస రతిక్రీడాని
ర్భరలంపటవృత్తి నెఱుక పఱిచి చెలిమి మైఁ
బెరసిన చెలి యెటు నను వే
గిరపాటేమిటికి నన్ను గెలువుము దొలుతన్. 142

వ. అని యతిప్రసన్న వదనయై తన్నుం జూచుచున్న యనార్య
తుకం జూచి యామె హృదయం బొక్కింత నిజస్వాంతంబు
నకుఁ బొడకట్టుచుండఁ దన యకార్యంబునకు లజ్జితుండై
పశ్చాత్తాపంబున శోకసంతాపమ్ములు ముమ్మడిఁగొనఁ
గన్నీరు నించుచు నిట్టూర్పులు పుచ్చి యతం డిట్లనియె.

గీ. అకట! గురుతల్పగతుఁడ నన్యాయరతుఁడ
దురిత భూమిని సముదగ్ర నిరయగామి
నేల రోయక ననుఁ జూచె దిట్లు తల్లి!
పాపిఁ గరుణించుటయు మహాపాతకంబు. 144

ఉ. తల్లియు నోర్వఁదిట్లు లపథంబునఁ బైఁబడి మత్తచిత్తుఁడై
తల్లడపెట్టు నాత్మసుతుఁ దప్పిదముల్ సయిరింప నెట్లు లు
త్ఫుల్లముఖాంబుజంబుపయిఁ బొల్పొకయించుక తప్పకుండ నీ
వల్లనమాటలాడఁగల వైతొ యెఱుంగఁగదమ్మ మూర్ఖుడన్.

గీ. అంబ నీ హృదయంబు దురాసదంబు
నంబునిధికంటె దురవగాహంబుసూడ
బహువిమోహ మహాగ్రహ బంధురంబొ
వివిధ గుణమణి నికరైక విభ్రమంబొ. 145

గీ. నీదు నుడు లింద్రజాలకుంచికలొ, కాక
ధీసమీాకృతి దివ్యౌషధీరసములొ,
నీ ప్రసాదంబు విషభక్ష్య నిష్ఠురంబొ,
యమృతరసవాహినీవీచికాకులంబొ. 146

గీ. నిరయకారి మహాపాప నిశ్చయమున
నీకు నాకుఁ బ్రాయశ్చిత్త నియతి గలదొ
యవిదితత్వప్రభావుండ నగుటఁ జేసి
నాకు నొకనిక కలదొ నిర్ణయము చెపుమ. 147

గీ. వాదమున నిన్నుఁ గెలువంగ వచ్చునేని
ధీరమతి నిష్టసంగతిఁ దేల్తు నంటి
వుడుగ కపరాదిప్రైఁ బ్రొద్దు వోడుచునేని
నన్యుఁ గవసెద ననుట గాదగునె యదియు. 148

వ. అని యత్యంత దైన్యంబున నంగలార్చుచున్న యన్నలిన
వైరిం గాంచి యకించిత్కృపాతరంగితాంతరంగయై య
య్యంగనారత్నంబు వాని నింకను నలయింప నేల యని
సాదరమధురాలాపంబుల బుజ్జవంబు దోప నిట్లనియె. 151

గీ. నిన్ను గొని తెచ్చి యిచ్చోట నిలిపికొనుట
ప్రొద్దుపోకకుఁ గాని దుర్బుద్ధిగాదు
బెడిసి చనకుండఁ జనవిచ్చి పిలుచుంట
నినుఁ బరీక్షింపఁగాని దుర్నీతిఁగాదు. 149

గీ. దైవఘటనలు పలుమాఱుఁ దడవియాట
విషయవైరాగ్య దృఢతా వివేకమునకు
నిన్నుఁ గడు నిష్ఠురముగ నిందించిపలుకు
టాత్మ దోషాపగమసముద్యమము కొఱకు. 150

శా. ధర్మోపప్లవబుద్ధి నీనడచు చందంబెల్ల నూహించి దు
ష్కర్మండయ్యెదవంచు నిమ్మెయి మహాకారుణ్య మేపార భా
వోర్మివ్రాతము రేచి పొంగడచు న య్యుద్యోగ సంసిద్ధి కీ
కూర్మిం జూపితిఁగాని యొండు తెఱఁగే గోరంజుమీ పుత్రకా.

క. కావున విగతవిమోహుఁడ
వై విషయపరంపరానిహతిఁ బొందకుమీ
నావుడు విస్మయ భయల
జ్జావినయము లడర గళిత సంభ్రముఁ డగుచున్ 151

వ. తత్క్షణంబ యయ్యాచార్యపత్ని పాదపద్మంబులకు సాష్టాంగ
దండ ప్రణిపాతంబు గావించి యోరకొదిగి నిలిచి బద్ధాం
జలియై దేవీ! యిక్కుమారు నపరాధంబు సైరించి కృతా
ర్థుం జేయు మనిన నామె యిట్లనియె. 152

ఆ. వె. దైవఘటన మున్న దల్లి నే నగుటెంత
యరయ నీవు కొడుక వగుట యెంత
యనిన నాదుపలుకు లర్థయుక్తము లయ్యెఁ
దల్లి నైతి నీవు తనయుఁ డైతి.

ఆ. వె. నీవు సుతుఁడ వగుచు నెమ్మి నా హృదయగ
ర్భంబుసొచ్చి వెడలఁ బాఱె తిట్లు
దాన నాదు మాతృధర్మంబు విదితమై
నది గదయ్య! యింక నార్తి విడుము.

క. శ్రుతు లోకోక్తియెడ నోకో
క్తి తెఱంగున నన్వయింపఁ గలయవి శిష్య
వ్రత నిష్ఠుఁడ వగు నీయెడ
సుతభావము కలిమి యిట్లు సుస్థిరమయ్యెన్.

గీ. పతిసుతుం డౌట వేఱొక్కభంగిఁ జుమ్మ
దాని వివరింపఁగానేల తనయు నెదుట
గురుకుమారుండు గురుపత్ని గుణము లెఱుఁగ
కెట్లు తన్మాతృభావంబు నెఱుఁగఁగలడు ?

క. అని బుజ్జగించి పనిచినఁ
జనియె మునిసుతుండు వినయసంభ్రమములు నె
మ్మనమునఁ బెనఁగొనఁ దారయుఁ
దన సెజ్జఁ బరుండి సముచితస్థితిఁ బొదలెన్.

వ. ఇట్టు లారాత్రి శేషంబు నిశ్చింత నిద్రావైవశ్యంబున శిష్యు
నకును నిరతిశయ నిజప్రయత్న సఫలకృతి ప్రమోద
భరంబున నయ్యాచార్యపత్నికిని క్షణమాత్రంబై చన
నవ్వల యథోచిత విధానంబుల నయ్యిరువురు గురుసమా
గమ కాంక్షం గాలంబు గడపుచుండిరని యివ్విధంబున.162

క. వేంకట సుబ్రహ్మణ్య ప
దాంకుం డన్మల మహాన్వయ ప్రభవుఁడు ని
శ్శంకమతిఁ దోలుతరంగము
సంకలితము సేసె నివ్విషయ వాహినికిన్. 163

ఓం తత్ సత్.



శ్రీ గణేశాయ నమః.

శ్రీ రస్తు.

# విషయవాహిని

## ద్వితీయ తరంగము

గీ. నిర్జరేంద్రుని యజ్ఞంబు నిర్వహించి
యుచిత సత్కృతులంది శిష్యులును దాను
నెలమి మై నాశ్రమంబున కేగుదెంచి
వెలఁదిఁ గూడి సుఖంబుండె విబుధగురుఁడు. 1

గీ. రోహిణిం బెండ్లియాడి గురుండు దన్నుఁ
బ్రీతిఁ దనయింట నుండఁగోరిన కతాన
నాలు దానును గూడి గృహస్థవృత్తి
వెలయఁ జందురుఁ డందుండె వినయమెసఁగ. 2

వ. ఇట్లుండి యమ్మునికుమారుండు కార్యాంతరంబున నాచా
ర్యుండు తన్నుం బనుప నెందేనియుం జని యందుఁ గొన్ని
దివసంబులు సన మరలివచ్చువాఁడు దన మనంబున. 3

ఉ. ఆ యెలనాగ నాగరకతాతిశయంబును జవ్వనంపు లేఁ
బ్రాయము నాయతాక్షియుగ భాసురభంగియు హావభావలీ
లాయిత విభ్రమం బవిరలస్తన కుట్మల శోభ మున్నుగాఁ
బాయక మానసంబు దడఁబాటునఁ బెట్టఁగ సంచలించుచుఁ

క. ఇంటి మొగంబయి యా కాం్రి
ల్గంటి తనుధ్యాన వివశగతి గతిసడలం
గంటక పాషాణాదులఁ
గుంటువడుచు నడచువాఁ డకుంఠస్మరతఁ. 5

ఆ. వె. గురుని పనుపు దప్పఁ గూడక యిన్నినా
ళ్ళకట! ముద్దరాలి నాలిఁ బాసి
యేను దిట్టనగుచు నిటు లుంటిఁబో వాలుఁ
గంటి యొంటి నెంత గాసివడునొ. 6

క. అని యారవగచి తమకం
బున రేఁ బగలనక నడచి పొల్పుగ నొకరే
దన యిల్లు సొచ్చి యొండొక
పని దోపక పడకటింటఁ బడి యటుసూడఁ. 7

గీ. అందుఁ దన శయనంబున నతివయొార్తు
గాఢ నిద్రాభరంబునఁ గనులుమూసి
తగఁ బరుండుటఁ గాంచి య త్తపసి కొడుకు
దనదు నిల్లాలకా మదిఁ దలఁచి వలచి. 8

క. మోసపుఁ దెఱఁగున నేమో
చేసి మనం బలరఁ బరిహాసించెడువాఁడై
మోసల మలఁగెడు దివియకు
నాసవడక తొడరె నదియు నాటెం దోర్తోఁ. 9

వ. ఇట్లు నిజమనోరథంబు నేరమి మెయిం దీర్చికొనుచున్న
యయ్యుల్లాసిం గుఱితింప ననువుగానక మున్నందుఁ బరుండి

యున్న యండజయాన యతండు దనపతియకా వగచి మేల్కనియు నతని యమ్మేలంబునకుఁ దావిచ్చునదియై యూఱకుండ నతండు కృతకార్యుండై మఱునాఁడు దాను దన యిల్లాలి నాడవలయు వినోదవచనంబు లూహించి కొనుచుం బోయి వేఱొక్క యెడం బరుండి నిద్రాభరంబున నొండెఱుంగకయుండె నయ్యవసరంబున. 10

గీ. ఒక్కశిష్యుండు వాఁకిటి యొద్దనిలిచి
తనుఁ బేర్వెట్టి పిలిచినఁ దార సొక్కు-
దీరి యల్లన నయ్యంధకారబంధు
రంబగు నగారమధ్య దేశంబు సొచ్చి. 11

క. ఇదె యేను మేలుకని యు
న్నదానఁ బనియేమి సెప్పు నావుడు వాఁడ
మ్మదిరాక్షి తోఁడఁదాఁగురు
నిదేశ మెఱిఁగింపవచ్చి నిలిచితి ననుచుణ్. 12

వ. దేవీ! నేఁ డొక్క యతివరుం డీ య్యాశ్రమోపాంతంబు నకు వచ్చియుండుట విని మద్గురుండు శిష్యగోష్ఠి సాలించి పూజ్యపూజావ్యతిక్రమంబు సేయంగూడమి నటనుండియ తత్సవిధ దేశంబు సేరంజనుచు మీ కీ వృత్తాంతంబు విన్న వింప నన్నుం బనిచె ననుటయుఁ గలంకవాఁడమి య య్యకలంకచరిత్ర యేమీ! మీ గురుం డింతకుము న్నిచ్చ టికి వచ్చిపోవండె నావుడు వాఁడు సవినయంబుగాఁ దదనా గమన వృత్తాంతంబు దేటపడం జెప్పి చనియె. నంత

నామెయు సంతాపంబు పట్టనేరక ద్వారంబు గుఱితించి
చని యొండొక్క ప్రదేశంబున వెలుంగుచున్న దివ్యాయం
గొనిపోయి చూచి యది స్వప్నంబుగామి నెఱింగికొని
నిశ్చేష్టితయై మూర్ఛిల్లి లేచి యి ట్టెటుపా టెవ్వనివలన
సంప్రాప్తంబయ్యెనో యని వగచుచు నా రాత్రిశేషంబు
నెట్టకేలకుం గడపె నప్పుడు.

క. యతి పూజారతిని బృహా
స్పతి యాశేయెల్లఁ గడపి భవనము సేరెన్
ధృతి బల్మి లోని నెవ్వగ
పతియొఱుగక యుండ నుండె భామామణియుఁ. 13

గీ. చందురుఁడు వచ్చి గురుపాద వందనంబు
భక్తిఁగావించి వినయసంపత్తిదోప
తాను నప్పుడ వచ్చు చందాన మెలఁగి
తన్నుఁబనిచిన కార్యంబు విన్నవించె. 14

సీ. అమ్మనీందు్రిందును నతిథిపూజాపూర్వ
కముగ సాపడి గృహాంగణమునందు
గూర్చుండియుండ నిగ్గులుదేరు దేవయా
నమున మాతలి వచ్చి నతు లొనర్చి
దేవ! దేవవిభుండు దేవర శిష్యయు
క్తముగఁ దోడ్కొని తెమ్మ తడయ కిపుడ
నావుడుఁ జనుదెంచినాడ నావిని యొందు
పలుకఁ జాలక వేగఁ బయనమగుచుఁ

గీ. దారకెఱిఁగించి చందురు దారయపుడు
చెఱఁగు మాసినయదిగాన చెప్పి నిలిపి
సకల శిష్యగణంబుతోఁ జనియె నమర
పత్తనంబున కాకాశపథమునందు. 15

వ. అంతకుమున్న యారోహిణీ కాంతుండు నిజకాంత రజో దోష సంక్రాంతయై యారేయి వేఱొక్కచోటం బరుండి యున్కియు నామె నొంటినుంపంజాలక తార తత్సన్నిహితంబగుటం జేసి నిజశయనాగారంబునం బవ్వళించియుండుటయు నిజకళత్రంబు సెప్పు మాటలవలనన యెఱింగి గాఢతరదుఃఖవేదనం బొగులుచుండువాఁడు. నిజవృత్తాంతంబు సెప్పికొనరే యగుడు నేకాంతంబునందున్న యన్నాతుక కడకుం బోవుటయు నతనిం జూచి. 16

క. వీఁడతి చపలుఁడు రేఁ దన
జాడ దెలియకుండ వచ్చి శయ్యాస్థలి నా
పోడిమి దెలియక తాన
వ్వేడబములు సేసెఁ దనదు వెలఁదియ యనుచున్. 17

గీ. అనుచు నూహించికొని శోకమగ్గలింపఁ
గన్నుఁగవ బాష్పములు చనుకట్టులంటి
పాఱ నేడ్చుచునుండ నప్పుడఁతితోడ
నొండు మాటాడవెఱచి నిట్టూర్పు లడర. 18

వ. పాదప్రణామంబు గావించి బద్ధాంజలియై కన్నీరు నించుచుం గొంత సేపూఱక నిలిచియుండి యనంతరంబున ధైర్యంబు

దెచ్చికొని దేవి! పాపాత్ముండఁ జపలస్వభావంబున నొందు దలంచి యొందుసేసితి నాకుం బ్రాయశ్చిత్తం బాదేశించి యనుగ్రహింపు నావుఁడు దన సంశయంబు నిశ్చయంబగుట కాశ్చర్యంబును, నతని యయ్యకార్యంబునకు నసహ్యంబును, దనకైన యయ్యకృత్యంబునకు సంతాపంబునుం బొందు చుం గొంతవడి నిశ్చలస్వాంతయై యాలోచించి యచంచ లంబగు ధైర్యంబున వాని మనంబు నింకను బరీక్షింపం దలంచి యల్లన నిట్లనియె. 19

గీ. అంటువడి నేఁటి కేడునాళ్ళయ్యెఁగాని
మొన్న నటుమొన్న ననుఁదాను ముట్టి యెఱుఁగఁ
డకట యూఱవరేయంచు నాత్మఁదలఁచి
నిన్న నీయింట శయనంబు నిశ్చయించె. 20

క. కదుకొను తమకము పెంపున
వెడవెడఁ బనులెల్లఁదీర్చి విభ్రమ మొదవం
దొడి పూసికట్టి కోర్కులు
గడలు కొనం దరలి శీఘ్రగమనం బెసఁగన్. 21

గీ. ఏను బతిరాకవార్చి నీ యిల్లు సొచ్చి
నెఱతనంబునఁ గోడలి నిదురపుచ్చి
కాఁచికొనియుండి వేసరి కనులుమూయఁ
గుత్సితంబగు విధిచెయ్దిఁ గూర్కవట్టె. 22

క. ఆకూర్పు గాఢతర ని
ద్రాకృతిఁ గైకొను తెఱుంగ నసదృశరస లీ
లాకల్ప చతుర సురత క
ళాకౌశల విభ్రమము వెలయ మేల్కంటిన్. 23

ఉ. చీఁకటి పెల్లునన్ విభునిచేతలకా మదిలోఁ దలంచి య
వ్యాకులవృత్తిమైఁ దెలియనట్లు మెలంగుచునుంటి సౌఖ్యనుం
జోకయుఁ గ్రొత్తలై మనసుఁ జొచ్చి పొరింబొరిఁ గ్రమ్మనొక్క క్రొ
మ్మైకము నన్నుముంచికొని మ్రాన్పడఁజేసె నపూర్వవైఖరిన్.

గీ. ఆయనిర్వచనీయ సౌఖ్యానుభవము
గలుగ దఫలప్రయత్న సంగమములందు
దాని కలరూపు వర్ణింపఁ దరముగాదు
వేయు నేటికిఁ గులనిష్ఠ వీటిఁబోయె. 25

క. చెలువల కవితధరతులం
గలుగు విశేషంబు లెన్నిగల వన్నియు నా
కొలసె నిఁక నేమి సెప్పుదు
నలఘుమతీ ! వినుము గర్భమైనది నాకున్. 26

క. ఋతువగుట యెఱుఁగు నిజసం
గతిలేమియుఁ దానెఱుంగుఁ గడుపేర్పడియెం
బతియింట లేఁడు బొంకఁగ
మతిమంతుఁడ యింక నేటి మానము చెపుమా. 27

గీ. చేయవలసిన దంతయుఁ జేసివిడిచె
దైవమింకను నేకీడు దలఁచునొక్కొ
మనసు దనియక రతివిభ్రమములఁజిక్కి
నన్ను నీవంక కీడ్పుచున్నది గరంబు. 28

చ. అదివిధిచేష్టితంబొ,హృదయంగమ సంగమ సౌఖ్యవృత్తియో,
యుదరము లోని నీకొడుకు నుద్ధతభావమొ, చెప్పనేర న,
య్యెద మది దప్పెనింకఁగలదే? నినుబాసి నిమేషమైనను
బ్రదుకుదునన్న తాల్మి మరుబాధలకెమ్మెయినోర్తు జెప్పుమా.

క. అభిమతరతి సుఖలాలస
విభుతసెడం ద్రోల్లి నీవు విహ్వలమతివై
పరిభసెడి యుండఁగఁ గనుఁగొని
యభయంబిడి నన్ను డిట్టు లైతినె చెప్పుమా. 30

క. పతివెడలి పోక కడలక
మతి నేడిట్లయ్యెఁ దొంటి మార్గము సుజన
స్తుతభంగి కమును యోగ్య
వ్రతభంగ భయాతి రేక వశమునుగాదే. 31

గీ. అతఁడువోయిన నిమిషంబు నందపాడమె
నదను చిక్కెఁగదా యను నలరుపాటు
పుత్రభావంబు నీయందుఁ బోయి నేఁడు
ప్రాణనాయకుఁ డను బుద్ధి పట్టువడియె. 32

క. సలలిత సరస సవిభ్రమ
చలదచలత్తారకాప్రసరశుభనయనాం
చలగళదానందాశ్రుప
టల విదితస్వాఫలరతి కెడఁద దమకించెన్. 33

క. నీ సురతకళాచతురిమ
నీ సరసాలాపఫణితి నీ సొంబగు మదిం
బాసి చన దేమిసేయుదు
నో సుభగుఁడ యింక నెట్టు లోర్తుం జెపుమా ! 34

ఆ. వె. వ్రతము సెడియెననెడు వగలు దోడ్తోఁబోయి
రతులఁ దేల్తువనెడు రాగ మడరెఁ
గాలము చేటుపాటు కోరకవచ్చె నిం
కేల తడయ నన్ను నేలికొనుము. 35

ఆ. వె. మనసు తివుటదీఱ మన్నించి రతికేళి,
దేల్పనింక నీవ దిక్కునాకు
మగనితోడిపొందు దగదెట్లు చూచిన
నీకుఁగొడుకుఁ గాంచు నెలఁతనగుట. 35

క॥ పితరుల ఋణంబు దీర్చెదు
మతిఁ బతి సతివడయు దైవమహిమంబున నీ
పితరుల ఋణంబు దీర్చెదు
సుతునిం గనుదాననైతి సొలవక యేనున్. 36

క. తానేల నీదుసెజ్జకు
రానేల విభుండు పనిచె రయమారఁగనే
నానేల నుండ నప్పుడ
రానేల రతోత్సవాభిరతి నీ వటకున్. 37

క. ఇది దైవశక్తిచేనై
నది గాకిం కేమి ? ఇట్టు లరయంబనిలే
దద నిది దైవమొసంగిన
సుదతిం బొందుటకు లోనిసుతుఁ గాచుటకున్. 38

గీ. గర్భగతుఁడయ్యె దైవసంకల్పశక్తి
వానిరక్షణ మింకేల వలయు ననకు
మరయ దదృక్షణాయత్త మగునకాదె
నలినదళనేత్రి ! తదృక్షణంబు నీకు. 39

క. చవు లెఱుగని కూఁడగుటను
దవులువడక తొల్లి దిట్ట తనమున నుంటిం
జవి మఱిగి యిప్పు డెమ్మోయి
నవమన్మథమూర్తి ! య మ్మనసిజుం గెలుతున్. 40

ఆ. వె. ఎవ్వఁ డెట్టిరతుల నెలనాగ నెలయించి
పోదిసేసె రిత్త వోనిఫలము
వాని యట్టిరతుల వలని డెందము దిప్పి
కోలు మరుని మొత్తికోలు చెలికి. 41

క. చెలువుఁడ నీ సరసక్రియ
సలీల సంరంభసుభగ సంగమకేళీ
విలసనములు మదిఁదలఁచిన
గలుగుం జలుచిలుపపదని కళ లెవ్వోళ్లన్. 42

చ. అనియిటు పెక్కుభంగుల నిజాంతరవృత్తము డాచిడాచి య
వ్వనజదళాక్షి మన్మథ వివర్ధన సిద్ధ సనౌషధీప్రసూ
ననికర మంజుగుంజ దళినాద మనోహర వాగ్విభూతి నా
తని నెలయించుపొంటెఁ బెడదారులఁ బెట్టుచుఁ బల్కెయవ్వలన్.

క. లలిఁబొదలు మైమెఱుంగుల
వలపు పిసాళించు నడల వాఁడున్నెడకుం
జెలువ సని కనుల నశ్రులు
జలజల రాలఁగఁ బదాంబుజంబుల కెఱగెన్. 44

ఆ. వె. అతఁడు దప్పఁదొలఁగి యానతం బగు నాన
నమున విన్నదనము గుమిలియాఁడ
నిలిచి పెద్దప్రొద్దు నిలువు నీరయిచూచి
యిట్టులనియె వినయ మెసక మెసఁగ 45

శా. తల్లీ నన్నిటులాఁడ నీకుఁ దగునే దైవంబు చెయ్దిన్ సము
ద్యల్లోలాగ్ని శిఖాతతిం బడిన కామాంధుఁడ గాకేల యే
నుల్లాసంబున నిట్టి ఘోరనరకాంధూత్పాత హేతుక్రియం
జెల్లుం బొమ్మని చేసి సిగ్గడలి నిన్ జేరంగరా నోపుదున్. 46

క. అతి విషయలంపటుఁడనై
మతి నొక్కటి సేయఁబోయి మఱి యొక్కటి సే
సితి మాతృద్రోహం బీ
గతిఁ జేసినవాఁడనైతిఁ గలుషం బొదవెన్. 47

ఉ. దైవము చెయ్దినయ్యెనని తప్పుకొనం జనదాత్మమోహముం
ద్రోవఁగలేమి నిప్పరమదుష్కృత మిట్లు ఘటిల్లె నుజ్జ్వల
త్పావకహేతులందుఁ జొరఁబాఱక నిష్కృతిగల్గ దింక నేఁ
బోవలయుం గృపామహితబుద్ధి ననున్ వెసఁబంపు మిత్తఱిన్.

క. అని పశ్చాత్తాపము ధృతి
యును దైన్యము గట్టితెగువయును దోప నయం
బునఁ దత్పదపద్మములకుఁ
బ్రణామ మొనరించుటయుఁ గృపారతమతియై. 49

వ. తన పరీక్షాప్రయత్నంబు మాని య య్యకార్యంబు దప్పక
దైవ దుర్విలాసంబున నైనదియకాని యతండు స్వవిషయ
విషయ చాపలంబున మనః పూర్వకంబుగాఁ గావించినది
గాదని నిశ్చయించికొని యత్తార తారాపథంబునం జను
చున్న తన యున్నతయశంబు వాని యవివేక వశంబున
నట్లు మలీమసం బగుటకు నెంతయు సంతాపంబు నొంది
యలుకయు ననుగ్రహంబునుం బొందిన మనంబున వాఁడిమి
యొకవంకను బ్రసాదం బొక్కవంకను నెఱయు విలోకనం
బులు తదాననంబునం బొలయించుచు నిట్లనియె. 50

సీ. చపలుఁడ వత్యంత జడుఁడవు దోషాక
రుండవు రాత్రించరుండ వీవు
కడుఁ దమకంబునఁ గన్నులు గానక
స్వకళత్రమని గురువనితఁ బొంది
పాపంబుసేసి తిప్పాట నీ చెడుగునఁ
జెడిపెనై లోకంబుచేత నింకఁ
గానకోని యేఁ దిట్టు గుడువంగఁ బాలైతిఁ
బతి కతిద్రోహ మేర్పడియె నిట్టు
గీ. లగ్నిఁ జొత్తువయేనియు నవయవములు
గాలుఁగాక కళంకంబు గాలుటెట్లు
భ్రూణహత్యా మహాఘంబుఁ బొరయ నెట్టు
లేను ననలంబు సొత్తు నింకేది వెరవు. 51

క. ఈ నీ దుష్కార్యంబున
కే నిష్కృతియును బొసంగ దింత నిజం బిం
కే నేల డాపఁ బాపా
త్మా! నీదోసమున గర్భ మైనది నాకుణ. 52

గీ. శిష్యునకుఁ బుత్రిఁగాంచె నీ చెడిపె యనుచు
గురుని ప్రియాలిఁ బొందె నీ కుమతి యనుచు
నిన్ను నన్నును నింక నిందించుచుందు్రు
కన్నకొడుకును గన్నలోకంబువారు. 53

క. ఆరయక పనులు సేసెడు
వారల కెగ్గగుట యెందు వాలాయము దు
ర్వారజవంబున నగ్నిం
దూరిన మిడుతలకుఁ గీడు దొరకొను టరుదే ? 54

క. అతికామ చపల చిత్తుల
గతి యిట్టిద తల్లి దోడుఁ గడు పారంగ
న్న తనయ నను భేదములే
కతివలు భీతిల్ల వలయు నా దుర్మతికిన్. 55

ఆ. ఇట్టి వారలుండు టెఱిఁగియకాదె త
ల్లియును దోడుఁ బుత్రికయును ననక
యెట్టి చెలులతోడ నేనియు నేకాంత
పరతఁగూడ దనిరి పరమ మునులు 56

గీ. గురుని యానతి నుంటిపో కొన్నినాళ్ళు
పెంపుసెడ నంతలోఁ దీవరింప నేల
కుడిచి కూర్చుండి యటుఁ జూచి కొనఁగరాదె
యింతలోఁ బాసిపోయెడి దేమి నీకు. 57

చ. వలపు మదంబు గన్నుఁగవప్రాలి యిరుల్ గవయింప రేగి య
య్యలు సొరఁబాఱి నప్పుడిది యెవ్వతయేను నెవండ నన్న య
న్నిలుకడ లేలయుండు నవినీతి మనంబున లేకపోవుఁగా
కలవికి మీఱు బల్తమక మాఱడి పెట్టదె యెట్టివారలన్.58

ఆ. అనవధానబుద్ధి యఖిలదోషములకు
మూల మను టెఱుంగఁ జాలవైతి
పాలసుండ వీవు పడసిన యవ్విద్య
లెల్ల నొక్కమొగిన యేటఁ గలసె. 59

క. మేనరదము, రథికుండు చి
దానందుఁడు బుద్ధి రథనియంత, మనసు దాఁ
బూనుచు పగ్గము, తురగము
లై నెగడుం దాని కింద్రియము లూహింపన్ 60

గీ. అఖిల విషయాలి దాని విహారభూమి
సమవహితె తన్నియంతృ ప్రసక్తిలేక
వారువంబులు పెడదారి వట్టకున్నె
పగ్గము నిజేచ్ఛ కనురూపభంగిఁ దిరుగ. 61

గీ. ఇంద్రియాశ్వంబు లిచ్ఛమై నేగకుండ
సముచిత పథంబునందుఁ బోసంగు పొంటె
నధికశక్తి మనః ప్రగ్రహంబు కట్టు
బుద్ధిసారథి లేకున్నఁ బోలు నెట్లు. 62

క. జలముల నుద్ధతవాయువు
కలముం దివిచికొని పోవుగతి నింద్రియ సం
చలనానువర్తి డెందము
కొలదిసెడం బ్రజ్ఞఁ దివిచికొని చనుచుండున్. 63

గీ. పురుషుఁ డెవ్వేళ విషయోప భోగములకు
నుల్ల మడరించి యువ్విళు లూఱఁ దగునె
దైవవశమున నవి తమ దాము వచ్చి
యెదుటఁ బడినప్డు దగ నుత్సహించుఁగాక. 64

గీ. ఎందుఁ బరిపూర్ణమై హెచ్చుఁ గుందులేని
వారధి నదీప్రవాహముల్ సేరునట్లు
లోలసి విషయంబు లే యచంచలుని జేరు
నతఁడ శాంతివహించు నత్యంతమహిమ.  65

చ. అవహితబుద్ధియై తలఁచియు నర్హ్వతయుం దగుచోటుఁ జూచి త
న్నవశతఁ బొందనీక విహితార్థము లుత్తమభంగి యేర్పడం
జవిగొనఁ బోలుఁగాక వివశస్థితిఁ జిత్తము నెప్డు వానిపైఁ
దవిలిచియూఁటలూఱుచుసదావ్యథ సెందుటయుక్ వివేకమే.

గీ. ప్రకృతి వలనన యధికచాపలుడ వీవు
తల్లి సాధ్వీమతల్లి నాఁ దగిన నేమి
తండ్రి త్రిగుణాతిగాతిప్రథావిశుద్ధు
డై వెలింగిన నేమి మహాత్మకుండ.  67

క. నీ మనసు చంచలం బని
వేమఱు నుడువంగ నేల వినుమో మిహికా
ధాముండ! మనసు లన్నియు
నీ మూలము లవ వాని నెల వూహింపక్.  68

ఆ. నీవు చక్కఁబడిన నిఖిలంబు సక్కనౌ
నీవు చెడినఁ జెఱుతు వెల్లవాని
బంధములకు నీవు పరమహేతువవు మో
క్షమున కైన నీవ కారణంబు. 69

ఆ. అరయ నింద్రియముల కంటె నర్థంబు ల
ర్థముల కంటె మనసు దానికంటె
బుద్ధి బుద్ధికంటె భోక్త యమ్మహదాత్మ
పరము వానికంటెఁ బ్రకృతి పరము. 70

మ. వ్యవసాయాత్మక బుద్ధి నీకు గురువై వ్యర్థార్థ విశ్రాంతినిర్
దవులంబాఱఁగనీక పట్టి మహదాత్మం జేర్పఁ దచ్ఛితు నీ
వవులంబోయి వెసం బరప్రకృతి యందశ్రాంత విశ్రాంతిఁగం
దువు దానం దుదిదాకి సర్వపరముం దోషావలేపాతిగుణ్.

క. పరమాత్ముఁ బరమకాష్ఠా
పరగతి సచ్చిత్సుఖాత్ముఁ బడసితివేనిం
దురితములు వాసి నిశ్చల
తర సుసమాధానగరిమఁ దాల్తువు సుమ్మా! 72

ఆ. అదియ నీవుచేసినట్టి పాపమునకుఁ
బాచితంబు పరమ పావనంబు
జడుఁడ నీవు వట్టి జడవహ్నిఁ జొచ్చిన
జెడ దఘంబు నీవు సెడవు దాన. 73

వ. అని యతని కనురూపంబగు పాపనిష్క్రమణోపాయం
బుపదేశించి తన తెఱంగు చెప్పనదియై వెండియు నప్పండిత
పత్ని యిట్లనియె. 74

గీ. తొల్లి నా యందుఁ బొడమిన దుష్టభావ
మిప్పుడును నవినాశ ప్రవృత్తి నట్ల
యునికి నిటుసేసితో చూాత మనెడు బుద్ధి
నిన్నిపోకలఁ బోయితి నింతనిజము. 75

క. దైవవశంబునఁ దనకై
తావచ్చిన కీఁడుమేలుఁ దప్పింపంగా
నే వలఁతిగామిఁ బాపభ
యావిలమతి వగవ నెంతయాపద కైనన్. 76

క. మనసునఁ దలంప నోట వ
చనభంగిం బలుక, నొడలఁ జలుప నడర, దై
వ నియంత్రితాత్మనై యుం
దును సుఖదుఃఖములు నన్ను దొరయవ యెందున్ 77

గీ. పతిపరాభవ బుద్ధిఁ జొప్పటుప లేదు
వలచి యన్యునితో నొండు వలుకలేదు
వేడ్క నిట్లని తెలిసి కావింపలేదు
కాన నాకెట్లు పాప పంకంబు దగులు. 78

క. విషయ స్వభావనై ని
ర్విషమ చరిత్రమున నే నవికలస్థితి నే
విషయంబునకును లొంగక
విషయి పురాకృత ఫలానువృత్తి భజింతున్. 79

గీ. పాపి ననుఁ బొంది దుఃఖైకభాగి యగును
సుకృతి ననుఁ బొంది యత్యంతసుఖము లందు
నిదియు నదియును గోర నే నెన్నఁడైన
దైవ మెటు వుచ్చె నటు వోవుదాన నగుచు. 80

క. నాయెడ మది దుర్భావం
బే యదియును నీకు లేమి యెఱుఁగుదు నైనం
గాయజవివశత నంధుఁడ
నైయటు సేసితివి పాపి వైతివి దానన్. 81

వ. కావున నాచెప్పిన ప్రాయశ్చిత్తంబునం గాని నీవు పరిశుద్ధుం డవుకాఁజాల వింకఁ బొమ్ము. కృతంబునకు వగవక సుకృతం బార్జించికొమ్ము. నేను విపన్ననైతి నని కలంగకుము. నా తెఱంగుం జెప్పితిగదా. నీయెడం బ్రసన్నచిత్తనై యున్న దాన నని యెఱుంగుమని వానించంచి తాను నిశ్చింత వర్త నంబునం బతిరాక నిరీక్షించి యుండె నంతఁ గొంతకాలం బునకు.

గీ. దేవలోకమునకు నొక్కదివసమైన
నవనియం దగు నది యొక్కహాయనంబు
ధిషణుఁ డమరేశు కడ నొక్కదివస ముండి
వచ్చునంతకు సుతుఁ గాంచె వామనయన. 83

ఆ. పసిడి తొట్లలోనఁ బవళించి నిదురించు
కొడుఁకుగాంచి యతడు గుండె వగిలి
వానిరూపు రేఖ వర్ణించుకొని పోయి
యొంటినున్న వాలుగంటితోడ. 84

గీ. అకట కొడు కెట్లు పుట్టెఁ బాపాత్మురాల
యేడు గడచిన యదిగదా యేనుబోయి
చందురుని చిన్నెలెల్ల నిస్సంశయముగ
గాన వచ్చుచున్నవి వానియందు. 85

క. నీ కప్పుడు ఋతుసమయం
బాకులతం బోయినాఁడ నటు విధిలే కే
నాకంబున కింతటిలో
వ్రేఁకటి యె ట్లయ్యె నెట్లు వీఁ డుదయించెన్. 86

క. అని తీవ్రక్రోధంబునఁ
గనుఁగవ నిప్పుకలు రాలఁ గటము లదరఁగా
దను జూచు ప్రాణనాథుం
గనుఁగొని యత్తార తారకలు సుడివడగన్. 87

చ. కనుఁగవ యశ్రువారి చనుకట్టులపైఁ బ్రవహింప గుండియల్
దనికిన భీతి బిట్టదరఁ దల్లడమందుచు గద్గదస్వనం
బున హృదయేశ! నావలనఁబుట్టిన దోస మొకింత లేద యి
త్తనయుని జన్మకారణము దైవము మాటలు వేయు నేటికిన్.

క. ఇది యిట్లని నేఁజెప్పిన
మది నమ్ముట దుర్ఘటంబు మానిందప్రి! తపో
విదిత జగద్వర్తనుఁడవు
విధి నాహ్వానించి తెలియవేడెద నెల్లన్. 89

వ. అని సవినయంబుగాఁ బ్రార్థించిన న య్యాంగిరసుం డ య్యంగన పలుకుల కంగీకరించి ప్రశాంతుండై యంతర్బాహ్యశుద్ధి పూర్వకంబుగా నా జగద్విధాతయగు ధాతం దన హృదయ కమలంబున నిల్పి యచంచల ధ్యానంబున నివాత దీపంబునట్లు నిశ్చలమూర్తియై యుండ నప్పుడు. 90

సీ. నలుమొగంబుల వేదనాదంబు లింపార
జిహ్వాగ్రమున వాణి చిందు లాఁడ
సకలవిద్యలు మూర్తి సహితంబులై కొల్వ
వల కేల మణికమండలువు గ్రాల
రాజసస్ఫూర్తి గాత్రమున రక్తిమ దోప
బసిడికిన్నెర బొజ్జ పరిఢవిల్ల
ధవళవస్త్రానులేప విభూతి చెన్నార
రత్నభూషణ కాంతి రవళిసూప

గీ. హంసవాహన మొక మోాిల నాట లాడ
నారదాది మునీంద్రు లున్నతి భజింపఁ
బటుతర సమాధి నున్న యప్పరమ మునికి
నెదుటఁ బ్రత్యక్ష మయ్యె వాణీశ్వరుండు. 91

క. అమ్మేటి వేల్పుఁ బొడగని
యమ్మరుదాచార్యుఁ డురుభయంబు వినయ భా
వమ్ముఁ గడుసంభ్రమమ్మును
గ్రమ్మిన మతితోడఁ బ్రణతి గావించుటయుఁన్. 92

వ. అక్కమలాసనుం డతని నెమ్మొగంబునం బ్రసాదమేదురంబు లగు సాదరావలోకనంబులు వొలయించుచు దరహాస భాసురంబగు వదనకమలంబు నందుండి తేనియ లుట్టిపడి మధురస్వరంబున నిట్లనియె. 93

ఆ. అనఘ సిగ్గుకతన నాత్మ నీ కోరిన
యర్థమెఱుఁగఁ జెప్పవయ్యె దీవు
నీమనం బెఱింగి నేన చెప్పెద విను
మయ్య పుత్రజనురుదంత మెల్ల. 94

క. నవవైధవ్య భరంబున
నవయుచు వారింపఁ గా వినక పితృసదృశుం
డవు నయ్యుతథ్యుపత్నిం
గవసితి మమత యనుదానిఁ గామాంధుఁడవై. 95

గీ. అన్నయిల్లాలు దేవరన్యాయకలన
కర్హుఁడగు వాఁడ నేను నా యభిమతంబు
సర్వభూతేప్సితం బంచు సాహసించి
తలుక లో నున్న కొమరుఁ డల్లాఁడు చుండ. 96

క. మానీంద్ర! యేను సోదర
సూనుఁడ లోనున్న వాఁడ సుతు నొం డొకనిం
దానెట్లు దాల్చు జనని కృ
పానూనత నన్నుఁ జూడు మని యతఁ డేడ్వన్. 97

గీ. దయఁదొఱంగి దీర్ఘతమసుండ వగు మని
యడ్డుసెప్పె ననెడు నలుక వానిఁ
గ్రూరముగ శపించి మారశరాసార
దళితచిత్త వృత్తిఁ దరుణిఁ బొంది. 98

క. తనయు భరద్వాజుండను
మునిఁ బడసితి వట్టి దోసమున కలిగి భవ
జ్జనకసముఁ డగు సుతఘ్నుం
డనఘా! స్వర్గ్యాసి యయ్యె నపుడు శపించెన్. 99

వ. అట్టి యయ్యకార్యంబును జ్యేష్ఠభ్రాతృ శాపంబునుం గార
ణంబులుగా నీకిట్టి యక్రమంబు దైవవశంబున సంప్రాప్తం
బయ్యె నని చెప్పి యవ్విరించి వెండియు నిజప్రభావంబున
నాటి తెఱంగంతయు నవ్వాచస్పతి చిత్తంబునకుఁ దానపొడ
కట్టునట్లు చేసి యందుల కతండు లజ్జితుండును సంతప్తుండునై

నిట్టూర్పు పుచ్చిన నతని నూరార్చుచు నద్దేవుండు మరల నిట్లనియె. 100

ఆ. నీవు తెలిసి తెలిసి నీయన్న యనుఁగు టి
ల్లాలి గవసి తట్టు లడలుచుండ
నెఱుఁగ కిట్టులయ్యె నెలనాగ తార త
న్నియమ నిష్ఠ యధిక నిర్మలంబు. 101

క. తార యిది విషయవాహిని
దారయగుట నీ పురాకృత మహాపుణ్యో
దారత కలిమిని ద్వన్మము
తారతి నీ దుష్ఫలం బొదవె మునినాథా ! 102

క. చంద్రుండు మనసు సతతము
నింద్రియముల వెంటఁబోయి యిట్లయ్యెను నీ
సాంద్ర వివేకంబున మా
నీంద్రా! సరి సేయవలదె హితవచనములన్. 103

క. ధిషణుండ వీవు ధిషణా
విషమస్థితిఁ బొంద కతివివేకంబున ని
వ్విషయాపగఁ దరియింపుము
సుషమావతిఁ దారఁ దేటిచూడుము ప్రీతిన్. 104

క. కడు సాధ్వి యాలు నీ శి
ష్యుఁడు సుపవిత్రతరతుఁడు పుట్టియున్న కుమారుం
డుడుపతికొడుకయ్యెను నీ
కొడుకు సుమీ! సద్వచస్సుగుణసంపదలన్. 105

గీ. నీవ యను బుద్ధిఁ జందురు నెలతవొంది
నిన్నుఁ బోలిన సత్పుత్రు నెమ్మిఁగాంచె
నతివ రతికేలి నెవ్వని యందు మనసు
నిలుపు వానిన పోలు నన్నినువుఁ గాంచు. 106

వ. నీ యీ కుమారునకు సర్వజగ ద్విదితంబుగా బుధుం డను నామకరణంబు సేసితి. గ్రహగణస్థానంబునుం గవి మిత్రి సాన్నిధ్యంబును వచోమూర్తియగు నీతండు దన తపస్సిద్ధి వలనఁ దాన పడయం గలవాఁడు. కలంక సెందక సుఖం బుండుమని! చెప్పి యప్పితామహుండు తిరోధానంబు సేసె నని యివ్విధంబున. 107

క. బుద్ధియు మనసును విషయస
మృద్ధియు నను మూటి చరిత మిద్ధవచస్సం
సిద్ధివెలయంగ సముచిత
బుద్ధిం జేసితిఁ బ్రబంధముగ నిబ్బంగిన్. 108

క. వెంకట సుబ్రహ్మణ్యా ప
దాంకుడ నన్నూల మహాన్వయభవుండను నే
ణాంకపదభక్తిఁ దీనిఁద
దంకితముగ వ్రాసితిం బుధాదర మొదవన్. 109

ఓం తత్ సత్.

---

శ్రీ రస్తు.

# ఉ త్త ర ది గం గ న



క. ఘనుఁడు కహోళుం డనియెడు
మునియుద్దాలకమహర్షి ముద్దుల కూతుం
దన ధర్మపత్నిఁగాఁ గొని
యనయము గృహధర్మనిష్ఠ నలరుచు నుండన్. 1

క. జనియించె నా సుజాతకు
ననుపమ గార్హస్థ్య సువ్రతామరతరుసం
జనితఫలంబో యన నొక
తనయుం డద్భుతమతిప్రభావిశ్రుతుఁడై. 2

వ. అతండు గర్భగతుండై యుండి నిజజనకు నధ్యయన విపర్యయంబు నాక్షేపించి యతని శాపంబున నెనిమిది వంకరలతోడి శరీరంబునం బుట్టి యష్టావక్రుం డను పేరం బరగుచు వంది యను వరుణపుత్రుని వాదప్రభావంబున కోటువడి నీటం బడిన యక్కహోళుం దన విద్యావిభవంబున నుద్ధరించి తత్ప్రసాదంబునను, దైవతానుగ్రహవిశేషంబువలనను నసాధారణ రూపసౌష్ఠవంబు వడసి సంప్రాప్తయావనుండై. 3

గీ. దార సంగ్రహకాంక్ష వదాన్యుఁ డను మ
హర్షి సత్పుత్రియగు సుప్రభాభిధాన
రూప లావణ్య తారుణ్య రుచిరమూర్తి
సుగుణ మణిగణభూషిత సుదతిఁగోరి. 4

గీ. చేరి మధుమాస దివస లక్ష్మీవిలాస
రాజితలతాంత యగు వన రాజిఁబోలె
లలిత శుభగాత్రి యగు నవ్వేలందిఁ జూచి
యవ్వదాన్యుని కడ కేగి యడుగుటయును. 5

వ. అతం డమ్మునికుమారుం గాంచి యయ్యా! నీ యభిమతంబు నేసెద. నీ విప్పు డొక్క సమయంబు పాటింప వలయు నది యెద్ది యంటేని వినుము. 6

సీ. అలకేశ్వరుం డుండు నెలవు సందర్శించి
హిమవన్మహీధరం బెల్ల దాటి
కైలాసనిలయు శంకరు భక్తి సేవించి
నలి నొప్పు నీలవనంబు గడచి
యందొక్కయెడఁ గందు వతివ నొర్తుఁ దపోవి
ధాన సువ్రత సమాధాన కలిత
సురుచిర పుణ్య తేజోవిరాజిత మూర్తి
నతిలోకచతురవాచాభిరామ

గీ. నమ్మహాభాగ దర్శించి యభిమతాను
సారి వర్తనమున నుండి సరగ రమ్ము
నీదు రాకయ తడవుగా నిర్మలాత్మ!
కన్య నిచ్చి వివాహమంగళముఁ దీర్తు. 7

౫. అనఁటయు నట్లుకాక యని యమ్మునికుమారుం డుత్తరాభిముఖుండై దినదిన ప్రయాణంబుల నానా విధౌషధీ సమృద్ధంబును, సిద్ధచారణ సంసేవితంబును నైన హిమవన్నగంబు సేరి బాహుదానదిం గాంచి యందశోకంబను పుణ్యతీర్థంబునం గృతావగాహుండై దేవర్షిపితృ తర్పణంబులు గావించి యారే యచ్చటం గడపి, మఱునాఁటి ప్రాతః కాలంబున విహితకృత్యంబులు దీర్చి, యటఁ బయనంబు సాగించి, కైలాసంబు నధిగమించి, మణిభద్రప్రముఖ యక్షరక్షోగణ రక్షితంబును గాంచన ద్వారశోభితంబును నైన మందాకినీ సరోవరంబు సూచి యచ్చటివారి వలనం గుబేరునకుఁ దన రాక యెఱింగించి యతండు దన్ను సముచిత పూజా విశేషంబుల గారవింపఁ దన్మందిర ప్రవేశంబు సేసి యందుఁ గనక మయోన్నతాసనంబునం గూరుచుండి య య్యక్షేశ్వరుండు తన చిత్తవినోదనంబు గోరి కావించిన యుత్సవంబున నుర్వర, యూర్వశి, మిశ్రకేశి, సుకేశి, రంభ, రతి, చిత్ర, చిత్రాంగద, రుచి, ఘృతాచి, ప్రభ, మనోహర, సుముఖి, హాసిని, విద్యుత, విద్యోత, దాంత, ప్రశమి, యలంబుషి మొదలుగాఁ గల యచ్చరలేమల నర్తనంబును హాహా, హూహూ, ప్రభృతులైన గంధర్వుల గానంబునుం జూచి యందుఁ గొంతకాలం బుండి, యవ్వైశ్రవణు వీడ్కొని, యుత్తరదిగ్యానంబునం దరలి కైలాసంబు, మందరంబు, కైరాతంబు, హైమంబు, ననంబడు గిరివరంబులు గడచి సమతలం బగు నవ్వలి భూభాగంబు సొచ్చి చనువాఁడు

ముందట సర్వర్తుగుణోపపన్నంబు లగు ఫలమూలంబుల చేతను, గలకూజిత మనోహారంబులగు విహంగవారంబుల చేతను నతిరమణీయంబులగు వనోద్దేశంబులచేతను నొప్పారు చున్న యొక్క యాశ్రిమంబును, గనకమయంబులు వివిధ మణిగణప్రిభాపటల జటిలంబులు నగు క్రీడాశైలంబులను, రత్నమయ భూనివిష్టంబు లగు కేళీ సరోవరంబులను గాంచి పరమానందంబు నెందుచుఁ దన్మధ్య ప్రిదేశంబున. 8

సీ. మహితకాంచన రత్నమయ పర్వతములచేఁ
బ్రిమదకారి విమాన పంక్తిచేత
మందార కుసుమ సంపన్నసుస్థలులచే
మణి వినిర్మిత కుట్టిమములచేత
మందాకినీ జలోన్మగ్న వాయువులచే
రమణీయ మణితోరణములచేత
వజ్రోపనద్ధ భూవలయ భాగములచేఁ
బ్రికటి తోద్యానవాటికల చేత
గీ. బహువిధానేక చిత్రిశిల్పములచేత
దీపితాంభోజ రాగ వేదికల చేత
వర్ణనాతీత విభవ సంపూర్ణమైన
భవనపుంజంబుఁ గనియె నా బ్రాహ్మణుండు. 9

వ. అందు వివిధ వేషాలంకార శోభితులు, నతిమనోహరాకారులు నైన స్త్రీ పురుషులం గాంచుచుఁ జనిచని యొక్కయెడఁ దాను జూచిన యన్నింటికంటె నత్యంత ప్రిమోద హేతువై

యున్న యొక్క యున్నత ప్రాసాదంబు సూచి కక్ష్యాం తరంబులు గడచి ద్వారదేశంబు సేరి యందు మెలంగు చున్న యసమాన రూపరేఖావిలాసభాసమాన లగు కొందఱు కన్నియలం గని యేను దూరదేశాగతుండ నగు నతిథి నాతిథ్యం బీయఁగలవారు గలరే యని విచారించు టయు నయ్యవసరంబున. 10

క. రా రమ్మని యందొక సుద
తీరత్నము దారి సూప ధృతి వెలయ మహో
దారుం డగు నమ్ముని పకు
మారుఁడు సోపాన రచిత మార్గగతుండై. 11

గీ. నడుమఁ గక్ష్యాంతరంబులు గడచి కడచి
గగన చుంబిత మగు నగ్రికక్ష్యఁ జేరి
యందుఁ గాంచె మనోజ్ఞ కన్యాశతంబు
దన్నుఁ గొలువంగఁ గూర్చున్న తన్వి నొర్తు. 12

సీ. తరుణారుణిమ గుల్కు ధవళాంగముల పై
వలిపెంపుఁ దెలిచీర వన్నె నెరప
నిండుచందురుని గేలించు నెమ్మోముపై
దరహాస నవలక్ష్మి తాండవింప
యలఁతి కెంజిగి దేఱు నలికభాగంబుపైఁ
గుటిలాలక శ్రేణి గునిసియాడ
రవళిమించు గులాబిరంగు క్రొంబైటపై
బటువు గుబ్బలకాంతి పరిఢవిల్ల

గీ. విలసితోరునితంబమండలముపైన
యరిది లేఁగాను చూపుల కందకుండ
మధుర తారుణ్యలావణ్య మహిమ నొప్పు
నప్పడంతుక మదిగొంత యపహరింప. 13

వ. అమ్మునికుమారుం డించుకవడి యవశుండై యుండి తోడన ధైర్యంబు నవలంబించి యట నిలిచియుండ న య్యేలనాగ సఖీజనపరివృతయై ప్రత్యుత్థానంబుసేసి తోడ్తెచ్చి మున్ను దా నున్న యయ్యున్నతాసనంబున నాసీనుం జేసి స్వాగతంబుసెప్పి కుశలప్రశ్నంబు గావించి యర్ఘ్యపాద్యాదికం బొసంగి పరిమళతైలంబున దాసీనివహంబుచేఁదల యంటిం పించి కృతస్నానుం గావించిన పిదపఁ బసిండిచేలంబులు గట్టనిచ్చి యగరుధూపంబులు వొలయించి స్వహస్తంబున చందనం బలంది యగ్నికార్యంబు నిర్వర్తించికొనం దగు సన్నాహంబు నెరపి యనంతరం బభిమతాహారంబులం బరితృప్తుం జేసి మహార్హశయనంబున నించుక విశ్రమింపం బంచి పిమ్మట గోష్ఠీకలాపంబునకుం జొచ్చి తజ్జన్మదేశాభి జాత్యంబులును, దూరప్రయాణకారణంబును విచారించి తెలిసికొని వివిధదేశ వృత్తాంతంబులు విచారించుచుఁ బొద్దువుచ్చి సాయంసమయం బగుడు నమ్మునికుమారుండు సంధ్యావందనాది కృత్యంబులు నిర్వర్తించి కొనిన యనంతరంబున నుచితాహారపరితుష్టుం జేసి యొక్కరమ్య ప్రదేశంబున నృత్యగీతాది విశేషంబులఁ దన్మనోరంజనంబు సేయుచు నిష్టసఖీజనంబు వోవం బంచి యవ్వాల నవ్వామలోచన

వినూత్న రత్నదీపాంకుర పరిభావిభాసితంబు, భాసమాన
నానాచిత్ర మనోహరంబును నైన నిజశయనాగారంబునకుం
దోడ్కొని చని సురుచిర తల్పంబునం బవ్వళింపం బనిచి
దానిఁ గదియం బెట్టియున్న వేఱొక్క పర్యంకంబున దాను
నుం గూరుచుండి యల్లన కలకంఠ కంఠ కాకలీ కలకలారావ
రమ్యంబగు స్వరంబున నతని కిట్లనియె. 14

సీ. అనఘ ! యత్యంత దూరాగతుం డగు నీకు
నేఁజేయు నాతిథ్యనియతి వలన
హృదయరంజన మించు కేనియు నయ్యెఁ గా
దని నిర్ణయింప సాధ్యంబుగాదు
పాకంబు చవియును, బ్రమద గాన వినోద
నృత్యవైఖరియును, నెట్టులుండె
సురుచిరాస్తరణోపశోభితంబైన యీ
మృదుశయ్య మేని కిం పొదవె నయ్య!

గీ. యేను నీవును గాకొరు లేరు లేరు
క్రొత్త దాన నటంచు సిగ్గువడఁబోకు
ముచితవర్తనమున కింక నుత్సహింపు
మవుల నిద్రింతుగాని ధరామరేంద్ర! 15

చ. అనుటయు నా సరోరుహదళాయతలోచనఁగాంచి మానినం
దనుఁ డిట నంతయుఁ హృదయతర్పణకారియకాని యొండు లే
దనఘచరిత్రి! నిన్నుఁగనుమన్న మునీంద్రునిమాటకై ప్రియం
బునఁ జనుదెంచి నీదగువిభూతిఁ గనుంగొని చాల మెచ్చితిన్.

క. మది కింపు గాని దెద్దియు
నొదవద నీవలన మాకు నుగ్మలి యిఁక నే
నిదురించెద నీవును స
మ్మద మారఁ బరుండు మేల మసలఁగవలయున్. 17

వ. ప్రొద్దునుం బోయెఁగదా యనుటయు నమ్ముద్దియ ముద్దులుఁ గుఱియు నెమ్మొగంబున దరహాసంబు దీటికొన నతనిం జూచు నమ్మేలంపుఁ జూపునకుం దోడుగా మధుర వచనంబున వెండియు. 18

ఆ. నీవు బ్రహ్మచర్య నిష్ఠాగరిష్ఠుండ
వేనుఁ గన్నియను మహీసురేంద్ర
వ్రత సమాప్తి వలచి వచ్చితి వతిథి వీ
వాతిథేయినిం గదయ్య నేను. 19

క. నీ కుచిత పూజ సలుపక
నా కెమ్మెయి నిదురవట్టు నానాగుణ ర
త్నాకర నావుడు మునిసుతుఁ
డా కమలదళాక్షిఁ జూచి యల్లన నగుచున్. 20

గీ. అతిథి మదిఁగోర్కి యెఱిఁగి యీయంగ వలయు
నొల్ల నని యెడిదాని దా నుడుగవలయు
నతిథి పరతంత్రులకు ధర్మమనఁగ నిది యె
యొండు తలఁపులు మాని పరుండు మింక. 21

క. ఏ నిదుర వోవఁ గోరెద
మానిని! నన్నింక నిట్లు మాటలఁ బెట్టం
బూనకు మతిథిసపర్యా
ధీనమనస్కుల తెఱం గిదియె సు మ్మనుచున్. 22

ఆ. అతిథిచంద మెల్ల నారసి యితని కి
య్యభిమతంబు గలుగు నని యెఱింగి
పూజసేత పరమ పుణ్యమ కా కేల
పోవు దీని నెఱుఁగఁ బోల దెట్లు. 23

క. మనసరివై యతిథి మనం
బునఁ గల తన కోర్కి వెడలఁ బుచ్చెడ పో తా
గని తగుచందంబునఁ దీ
ర్చన వలయుంగాదె యతిథి పరతంత్రులకున్. 24

గీ. ప్రకట తారుణ్య సౌభాగ్యభాసితుఁడవు
తెఱవ లొనరింప వలసె నాతిథ్యకలన
క్రొత్త యని సిగ్గు వడెదు గా కిత్తెఱంగు
నీ మనోవర్తనము గాన నేర నెట్లు. 25

క. ఈ రూపయౌవనముల ను
దారగుణా! నీకు మనసు దగులద యేనిం
గోరిన జవ్వని గారవ
మారం దో డ్తెత్తుఁ జెప్పుమా తడవేలా? 26

చ. అని కడు బుజ్జవం బెసఁగ నన్నలినాయతచారునేత్రి ప్రా
ర్థన మొనరింపఁ గుంపతిలి దాపున నున్న ప్రసూనధన్వి క్రో
యని వెలిఁ బాఱిశింజినిరయంబు మెయిన్ మొఱయించుచుండన
మ్మునివరసూతి డెందము నమోఘధృతిం బిగఁబట్టి యిట్లనన్.

సీ. జలజాయతాక్షి నీ సౌందర్యమున కేమి ?
కడుఁగ్రొత్త యిమ్మోజ్జగంబు లందు
నందును నభినవంబైన దీ తారుణ్య
మైనను నినుబొంద నర్హ మగునె
తెలిపెద నింక నా తెఱఁగెల్ల వినుము నే
నస్ఖలద్బ్రహ్మచర్యవ్రతుండ
గార్హస్థ్యధర్మంబుఁ గాంక్షించియున్నాఁడఁ
బరసతి పొందు పాపంబు గాదె
గీ. యొక్క మునిపతి పనుపున నోడ కిట్టు
లేను నినుఁ జూడవచ్చితి నింతెకాని
యొండు కోర్కులు నామది నుండు టెట్లు ?
నిదురవోనిమ్ము నను నీవు నిదురవొమ్ము. 28

వ. అని సానునయంబుగాఁ బ్రార్థించి కన్నులు మూయుచున్న
యన్నాఁతుకయు దీర్ఘప్రయాణంబున నలసితిరి కాఁబోలు
మహాత్మా ! యట్లయిన నేటికి విశ్రమింపుం డని యూరకుండె. నట్లారేయి సనుటయు నమ్మరునాఁడు యథోచిత
విధానంబులఁ గాలంబు పుచ్చి సాయంసమయ భోజనంబైన
పిమ్మట సఖీజనంబు సేయు వినోదంబుల గొంతసేపు గడపి

వారందఱుం బోయిన యనంతరంబునఁ దొంటియట్ల రుచిర వేషాలంకృతయై యేకాంతంబునం బొడసూపి తచ్ఛయనో పాంతంబునం గూరుచుండి స్మరతరళం బగు కటాక్షవీక్షణం బతని మోముపయిం బొలయించుచు నామె యిట్లనియె.

ఆ. నీవు బ్రహ్మచర్యనిష్ఠుండ వేనును
నన్యు మొగము సూచినైన నెఱుఁగ
నతిథి పూజ యనెడు నంత మాత్రమ కాదు
నిన్ను వలచి వచ్చియున్న దాన. 30

క. ఇది సర్వభూత వాంఛిత
మిది యసదృశరసవినోద మిది పుణ్యఫలం
బిది ధర్మ మిది ముదావహ
మిది యౌవనభాగధేయ మిద్ధవిచారా ! 31

గీ. ఆకలియు నీరువట్టు నెట్లట్ల దేహ
ధర్మమగుఁగాదె కామంబు తాపసేంద్ర
యన్నమును నీరు నెట్లు గ్రాహ్యంబు లయ్యెఁ
గామినీస్పర్శ మెట్టు లగ్రాహ్య మయ్యె. 32

క. అనితఃపూర్వ విలోడిత
మనన్య పరిభుక్తరస మనామయ మధురం
బనవద్య మపరిహార్యం
బనఘా ! యీ జవ్వనం బనారాధ్యంబే. 33

ఆ. సదృశ వివిధ గుణ సుసంవాది యైన నా
మనసు నిన్నుఁ జేరె మగలరాజ
యిట్టి నన్ను నొల్ల వేనియు గార్హస్థ్య
కలన కింక నేల గడఁగ వలయు. 34

వ. అని తన మనోరథంబు దేటపడం జెప్పి యూరకున్న యన్నలినవదనం జూచి యమ్మునికుమారుం డిట్లనియె. 35

సీ. అలబుభుక్షా పిపాసలు మానసము లయ్యుఁ
దన్నిమిత్తంబులు దైహికములు
తదుపశాంతికిఁ బ్రియత్నము సేఁత దగవ పో
మొగి దేహరక్ష తన్మూల మగుట
నలినాయతాక్షి కేవల మానసమ కాని
కామంబు తనుపోషకంబుగాదు
కామశాంతికి వివేకము సాధనముగాని
కామినీసంభోగకలన గాదు

గీ. సకలధర్మములకు నాద్యసాధనంబు
తనువు గావునఁ దదుపేక్ష దగదు గాని
యఖిల దోషములకు మూల మైన మనసు
చాపలంబు నుపేక్షింపఁ జనదె చెప్పుమ. 36

క. కామము దా నెన్నండును
గామిని! కామోపభోగకలనం జెడ దు
ద్దామగతి నేయివోసినఁ
దా మండుం గాక యెందు దహనుఁడు సెడునే. 37

క. సంకల్పకృతము కామము
సంకల్పము లెల్లఁ జిత్తచాపలకృతముల్
సంకల్పశత వినాశము
పంకజముఖి! సద్వివేకపరిపాటి నగుణ్. 38

వ. కావున వివేకంబు పాటించి చిత్తచాంచల్యం బుడిపికొని సుస్థిరుండనైతి నింకఁ గాంతాసంగమంబు వలని కీడును దద్వర్జనంబువలని ప్రయోజనంబునుం దేటపడ సోదాహరణంబుగా నుడివెద వినుము. 39

గీ. ఊర్ధ్వరేతస్కులగు మును లున్నవారు
సురుచిరాయుర్బలారోగ్య శోభితాత్ము
లుర్వి రతిమదమత్తులు నున్నవార
లపగతాయుర్బలారోగ్యు లల్ప మతులు. 40

క. ఈయిరుఁదెగలం గని నిర
పాయస్థితి నుండఁగోరి పద్మదలాక్షీ!
నీ యిచ్ఛ నవాతిథ్యము
నా యిచ్ఛకుఁ బ్రియముగా దనంగణ్ వలసెణ్. 41

వ. ఇట్టివానికి గార్హస్థ్యప్రయత్నం బేల యని యాక్షేపించి తదియునుం జెప్పెద వినుము. 42

గీ. తరుణి మత్పూర్వు లగు తపోధనులు ప్రీతి
నసదృశాత్మీయ శుభగుణప్రసవకోటి
మరలఁ బ్రసవింపఁ గల యొక మాన్యకొఱకుఁ
దగిన బీజంబు నా యందు దాచినారు. 4

క. దానిఁ దగు పౌలమునందు శు
భానన! మొలపించి దాన నాత్మపితౄణ
గ్లాని యడఁగించి కొనియెదఁ
గాని వృథారతిసుఖేచ్ఛఁ గలఁగం జుమ్మీ. 44

చ. అనుటయు నట్లుకాక వలదందువె తావ్రశ్యమైన సత్ఫలం
బును మునినాథ! యంగనల బుద్ధులు కామపరైకవశ్యముల్
విను మటుపైని పుత్త్రిఫల విశ్రుతలాభము నీకుఁబోలె నా
కునుబ్రియమయ్యెడుందదనుకూలవిధింజరియింపునాయెడన్.

క. పురుషులకంటెను సంయమి
వర! చెలువల కెందుఁ బుత్త్రివాత్సల్య మిలం
గర మధికంబని యెఱుఁగవె
స్మరపరవశ నేల కేల చనియెదు చెపుమా. 46

క. నాకోర్కి దీఱ నిప్పుడు
గైకొని నను నేలికొందు గా కప్పనిచే
నేకక్రియ యర్థద్వ్రత
యాకల్పం బగున కాదె యారయ నీకున్. 47

చ. అనఘచరిత్ర నా హృదయ హారివిభూతికి నాకు నా సఖీ
జనమునకుం బ్రభుండ వయి సమ్మతి నింతయు నేలికొమ్ము ని
న్ననవరతంబు గొల్చి హృదయంగమ తావక సంగమక్రియం
దనియుచు భార్యనై సముచితస్థితి నుండెద నెల్లవేళలన్. 48

వ. అనుటయు నతండు. 49

క. నీవును గన్నియ వగుదువ
పో విచ్చలవిడిఁ జరింపఁబోలునె యస్మద్
భావజతంత్రకళా వి
ర్భావపరాధీన వీవు భార్య వగుదువే. 50

ఉ. నావుడు నమ్మునీంద్రు గని నాతుక మోహమున లేతనవ్వు సొం
పై విలసిల్ల నిట్లనియె నక్కట యెందును బైదలు ల్లస
ద్భావజతంత్రమాత్రపరతంత్రల నీ కది దోసమైనచోఁ
బో విడుమయ్య! యుద్వహనబుద్ధి వృథావ్యథ నెందనేటికిన్.

క. కామమునకంటెఁ బురుషుని
చేమగువకుఁ బొందఁదగు విశిష్టార్థం బొం
డేమియును లేదు గావునఁ
గామము విడుతేని గృహిణి గాఁదగవు సుమీ. 52

ఆ. సరసరతులఁ దేల్చు సత్కారమునకంటెఁ
బురుషువలన నొంటఁ బొలఁతి దనియ
దాతఁ డెట్టి ఫలము నాశించియున్నను
రతిఁ గఱంపవలయు రమణి నెపుడు. 53

గీ. రతులఁ దనియింపజాలని పతుల మొఱఁగి
యతివ లన్యులఁ గవయంగ నరుగు నపుడు
నిండు వేసవి నుద్దండ చండకిరణ
ఖరకరాతప్తపాంసువుల్ గాల్పలేవు. 54

క. కావున నీదు తపో వి
ద్యావితరణవినయముఖ మహాగుణములకుం
దా వలచి భార్య యయ్యెడు
నా వెలఁదుక గలుగ దవని యం దెందేనిన్. 55

క. అనిలానల వరుణాదులు
దనుగాత్రికి నెందు నిష్టదైవతములు గా
రనఘా ! విను పుష్పశరా
సనుఁ డొక్కఁడె దైవ మెట్టి సాధ్వికి నైనన్ 56

క. రతిశీలత తోడన వ్రత
రతిశీలత గలుగు లేమ రహి వేపుర కొ
క్కతె యున్న నుండు నందుం
బతివ్రతాత్వంబు గరము భర మరయంగన్. 57

ఆ. తల్లిఁదండ్రు లన్నదమ్ములు బావలు
మఱఁదు లాత్మభవులు మగఁడు ననెడు
వారిగౌరవంబు వలవరు చెలు లెందు
లలిత రతి సుఖంబు వలచినట్లు. 58

సీ. తొల్లి యింద్రుండు వృత్రుని జంపి తత్పాత
కంబు వెన్నంటినఁ గలఁగి దానిఁ
దరుసరిత్ స్త్రీ వసుంధరలకుఁ బంచి యీఁ
బోయిన నతనిచేఁ బూవుఁబోండ్లు

ఋతుకాల మాత్రసంగతిఁ బుత్రుఁ గాంచను
తీఱని రతితృష్ణ దిటవుకొనను
ప్రసవ పర్యంతంబుఁ బతిఁబొందు వడయను
వరము సేకొని రను వార్త వినవె

గీ. అట్టి దిట్టల కెంగేలు వట్టి వట్టి
పట్టికై కాఁచికొని ధృతిఁ బట్టి నిలుతు
రని భ్రమించెద వేని సంయమివరేణ్య
యింతకంటెను మౌగ్ధ్య మింకేమి గలదు. 59

క. సంతత రతికౌతుక వి
భ్రాంతలు చెలు లింక నెట్లు పడసెదు చెపుమా
సంతాన మాత్ర సముప
క్రాంత రతిప్రేప్స గలుగు గార్హస్థ్యంబున్.  60

వ. అని యివ్విధంబున నవ్వామలోచన సకలవనితాజనమనో
వృత్తంబు దేటపడం బెక్కులు సెప్పి యతని చిత్తంబునం
బొడమిన మెత్తదనం బూహించి యకించిజ్జవంబున నిజ
పర్యంకంబు డిగ్గ నుఱికి యగ్గలిక దోప నమ్మునికుమారు
శయ్యాతలంబు సేరి మృదుమృణాళవల్లరీ నిభం బగు తన
బాహుపాశంబున నతనిం బంధించి పొదివికొని యటఁ
బరుండుటయు నతండు ధైర్యంబు సిక్కంబట్టి యొండు సేయ
నోల్లక యల్లన యిట్లనియె. 61

ఆ. వె. తరుణి యేల నన్నుఁ దల్లడ పెట్టెదు
నీదు పొందు శాస్త్రనిందితంబు
నిన్ను నీవ యిచ్చికొన్న మాత్రమున మ
త్పత్ని వను తలంపు దగదు నాకు. 62

ఆ. వె. శాస్త్ర నియతిఁ దొఱఁగి స్వైరవృత్తమున నె
వ్వఁడు మెలంగుచుండు వాఁడు కర్మ
సిద్ధిఁ బడయలేఁడు చెలి! వానికెందు సు
ఖంబుఁ బరమగతియుఁ గలుగఁ బోదు. 63

క. కావునఁ గార్యాకార్యము
లేవాఁడును శాస్త్రమునన యెఱిఁగికొని సుసం
భావితమతిని దదుక్త వి
ధావర్తన పరత నున్కి దగు నెవ్వేళన్. 64

క. శాస్త్రమున మనువు డాచిన
నస్త్రీస్వాతంత్ర్య మర్హతి యనం గల వా
క్యస్త్రమునకు వెఱవక యీ
కుస్త్రీచరితంబు లేల కోరెదు తోడ్తోన్. 65

గీ. బాల్యమునఁ దండ్రి యౌవనపరిసర వేళ
మగఁడుఁ బిమ్మట నాత్మసంభవుఁడు పూని
దన్ను రక్షింప నునికి స్త్రీ ధర్మ మరయ
దాని నిట్టు లుపేక్షింపఁ దగునె నీకు. 66

వ. సర్వప్రాణి సాధారణంబును సకల జనవాంఛనీయంబును
నైన స్వాతంత్ర్యంబు స్త్రీల కేల లేదయ్యె నందు వేని నా
లోచిన తెఱంగు సెప్పెద వినుము. 67

సీ. పురుషుండు వింశతిపూర్ణుండు గాకుండఁ
బోరయదు యౌవనస్ఫురణ వాని
కాలోన మహిత విద్యాజ్యోతి వెలుఁగునఁ
దగవును ధర్మంబు దాన యెఱుఁగు
నెలనాగ పదునాలుగేండ్లు నిండకమున్న
సురుచిర యౌవనస్ఫూర్తిఁ బొదలు
నది చాపలముల కాస్పదమైన తఱిగాన
పరిణామ మెఱుఁగని పనులఁ జొచ్చుఁ

గీ. గామ వివశత మునుమున్న గాసిపడుచు
తులువ లగువారు కొంత దుందుడుకు సేయ
దుర్ణయములకుఁ బాల్పడి తుదకు నదియ
పథముగాఁ బోయి చెడుట తప్పదు నిజంబు. 68

క. ఆ పిన్న వయసునం దా
నోపునె పాత్రతఁ దగంగ నూహించి వర
ప్రాపణ సౌభాగ్యోన్నతిఁ
జేపట్టఁగఁ దండ్రి తగవు సేయఁడయేనిన్. 69

క. కావున నప్పుడు పితృర
క్షావశయై యునికి మేలు సముచితగుణసం
భావితుఁ డగు వరు నరసి ద
యావిష్ప్రితుఁ డాతఁ డిచ్చు నంతటిదాకన్. 70

గీ. అవుల నెవ్వనిచేతి కీయంగఁ బడియె
నతని సంరక్షణమున సమ్మతిఁ జరించి
తదభిమతరతిఁ దనియుచుఁ దత్కులంబు
వెలయ సంతతి వడయుట వెలఁది కుఱవు. 71

గీ. సహజ సుకుమారమూర్తియు సౌఖ్యపరయు
గర్భధారణ పీడాపగళితబలయు
నైన తొయ్యలి జీవయాత్రానుకూల
వృత్తులకుఁ దగ దనుమాట వింతగాదు. 72

క. నీ చెప్పిన చాపలములు
నా చెలువకుఁ గలుగునేని యనుపమపతి ర
క్షాచణత దప్పఁ జనదు గ
దా! చెలి యెబ్భంగి నస్వతంత్రియ యయ్యెన్. 73

గీ. ఇంక నెన్నఁడు స్వాతంత్ర్య మింతికొదవు
నొదవునేనియు నే ఫలం బొందు దాన
వార్ధకము సొచ్చి యొడలెల్ల వడఁకుచుండఁ
బుత్రరక్షణమున నుండఁ బోలుఁగాక. 74

గీ. పరుల రక్షణమున నుండఁ బరగి పుట్టి
నపుడ స్వాతంత్ర్యవిరహితయయ్యె వనిత
ప్రకృతి సాధారణంబైన పారతంత్ర్య
మెట్లు తప్పించకొనఁగల్గు నింతి చెప్పుమ. 75

క॥ స్వాతంత్ర్యపుఁ జవి మఱఁగిన
నాతుక పీ వెట్లు నిన్ను నా కిచ్చికొనం
జూతు వటు జూతు పో ని
న్నే తీరున నమ్మవచ్చు నెఱిఁగింపు చెలీ! 76

గీ. తల్లి చనుఁబాలతోఁ గూడఁ ద్రావి పెరుగు
హైందవాంగన పారతంత్ర్యవథంబు
దానఁ దల కంటగింపక తనదు జీవి
తంబు భార్యాత్వకలనకుఁ దగఁ జరించు. 77

వ. అని తన హృదయంబు తేటపడం బలికి యమ్మునికుమారుండు కాష్ఠకుడ్యంబు తెఱంగున నిశ్చేష్టితుండై తన పాదిగిటనుండ న య్యండజయాన తొలఁగి కూర్చుండి మహాత్మా! నా యపరాధంబు సైరించి న న్నొల్లవేని నీ యుల్లంబు పల్లవింపంజేయు నప్పల్లవాధర యెట్టిదై యుండునో యెఱింగింపు నావుడు నమ్మునికుమారుం డిట్లనియె.

సీ. దాంపత్య ధర్మవర్తన శుద్ధి గలయట్టి
తలిఁ దండ్రులకు మున్ను దాను బుట్టి
పితృ శిక్షణంబునఁ బెరిగి వారక వారి
శుభవర్తనంబులు సూచి చూచి
తానును నట్లుండుదానఁ గాకని బుద్ధి
దెలిసి నప్పటినుండి తలఁచికొనుచుఁ
బెండ్లి యీడని తన్నుఁ బ్రేమించు బెద్దలు
సెప్పెడు వరగుణశ్రీలు వినుచు

గీ. నుత్సుకత మున్ను గా వార లొసంగ నున్న
యురుగుణాకల్పు ననుఁ జూడ నుత్సహించి
బంధుసన్నిధిఁ గడు సిగ్గువడుచు నాకుఁ
గూర్మిఁ జేయిచ్చు చెలిఁపొందుఁ గోరియుందు. 79

సీ. పొసఁగఁ బెండిలినాఁడు పుట్టిన యుత్కంఠ
నించు కించుక యాకళించుకొనుచు
నల్లుని బిలువ మీాయయ్య వోయెదు నన్న
తల్లిమాటలకు నుత్సాహపడుచుఁ
గారణాంతర మొందు గల్పించికొనివచ్చి
యల్లన నా జాడ లరసికొనుచు
నిలు సొచ్చినది మొదల్ దలుపుచాటున డాగి
వీనుల విందు గావించుకొనుచు
గీ. నదిరిపాటున డాయంగ బెదరి చనుచు
నవులఁ జనినప్డు ప్రేమ మింపలరఁ గనుచు
వెడలిపోకకు మదిలోన విహ్వలించు
చోరిమి వహించు చెలిపొందు గోరియుందు. 80

సీ. ఎన్నినాళ్ళమ్మ! పుట్టింటిభోగము లంచుఁ
బొరుగువా రనుమాట బుద్ధిఁ గలపఁ
దొలుసమర్తైతి నీ చెలిమి యెన్నాళ్ళని
చెలికత్తె లనుమాట సిగ్గు వెనుప

నింత సిగ్గరివి యత్తింట నెట్లుందువో
యని తల్లి యనుమాట లాత్మ నొఱయ
నిటు సేయు మిటులుండు మెట్లును దప్ప దం
చతివ లాడెడు మాట లడలు గొలుప
గీ. నెట్టకేలకు లోపలి కేగుఁ దెంచి
భయము సిగ్గును వెసఁ దన్నుఁ బట్టి యూడ
బెనఁగులాడుచుఁ జేయూఁక బెదరిచూచు
కుసుమకోమలి పొందు నేఁ గోరియుందు. 81

వ. అని యిట్లు తన యుల్లంబు దెల్లంబుగాఁ బలికి యూఱ
కున్న యత్తపసిపట్టిం గని యమ్మత్తకాశిని నీ యిష్టం
బట్టిదయేని నింక నిదురవొమ్మని తాను దనశయనంబు
ప్రాపించి పరుండె నవ్వల నవ్విప్రకుమారుండు. 82

క. గంగాతరంగ శీకర
సంగాభంగుర మరుత్ప్రసర సరదుద్య
త్పింగ జటామండలుఁడై
యంగంబులు జలదరింప నట మేల్కాంచెన్. 83

వ. అప్పు డది ప్రభాతసమయం బగుటయుఁ దానున్న యన్నె
లవు వదాన్యు నాశ్రమంబై యుండుటయుం గాంచి యచ్చెరు
వడుచున్న యయ్యష్టావక్రు నొద్దకు నమ్మునిపుంగవుండు
సనుదెంచి సంభావించి యతం డడిగిన నమ్మత్తకాశిని
యుత్తరదిశ యగుటయు నామె చూపిన విశేషంబు పరీక్షా

మాత్రం బగుటయు నెఱుక వడం జెప్పి యమ్మహర్షి యమ్ముని కుమారుని వరోచితగౌరవంబున నింటికిం గొనిపోయె నయ్యనంతరంబున. 84

క. ఒక శుభముహూర్తమున న
య్యకలంక చరిత్రునకు మహర్షీంద్రుఁడు గ
న్యక నిచ్చి పెండ్లి సేసెం
బ్రకట మహోత్సవ వినోద భాసురభంగిన్. 85

క. అభిమత శుభగుణ వాణీ
నిభ సుప్రభ నిట్లు వడసి నీరజభవ స
న్నిభుఁ డష్టావక్రుం డురు
విభూతి గార్హస్థ్య మహిమ వెలయించె మహిన్. 86

వ. అని యిమ్మహర్షి చరిత్రంబు మహాభారతానుశాసనిక పర్వాంతర్గతంబగు నుపాఖ్యానంబు మూలంబుగాఁ గొని. 87

క. వేంకట సుబ్రహ్మణ్య ప
దాంకుం డుత్తరదిగంగనాఖ్య వెలయ నే
ణాంకాభరణుని శుభపద
పంకరుహార్పితముగాఁ బ్రబంధము సేసెన్. 88

---

శుభమస్తు.

# గర్వితకన్య



ఆ. అనఁగ ననఁగ నొక్క యవనీశ్వరుఁడు గలం
డనఘుఁ డతని కొక్క తనయ గలదు
పృథునితంబ దాని పేరు విద్యుత్ప్రభ
యనఁగ సుప్రసిద్ధమై వెలుంగు. 1

మ. ప్రతిభాగర్వము రూపగర్వమును శుంభద్వైదుషీగర్వమున్
జతురాలాపవతీత్వగర్వము గడుం జానొంది యే మన్మథ
ప్రతిమన్ జూపిన చేరువెట్టి నిరసింపం జూచి భూపాలుఁ డు
ద్ధతకోపానలదుర్నిరీక్ష్యుఁ డగుచున్ దన్వంగితో నిట్లనున్. 2

మ. "శమితారాతుల నింద్రతుల్యుల యశస్సంపన్నులన్ మన్మథో
పమసౌందర్యులఁ జీరికింగొనక దౌర్భాగ్యంపు గర్వాంధకా
రమునం బ్రేలితి విచ్చవచ్చినటు లౌరా! నీ మదోద్రేకభా
వము నానాటికి నా యుపేక్ష నతిదుర్వారక్రియం బేర్చెడున్

సీ. కుదియన్వైచిన మంటికుండ యీతం డని
పరిహసించితిగదా! పాండ్యవిభుని
తగదునాక మొడారితాటిచెట్టిత డంచుఁ
గేలి చేసితిగదా! కేరళేంద్రు

విలువంపు మగలలో వీఁడొక్కఁ డని పల్కి
యపహసించితి గదా! యంగనాథు
భల్లుకేశ్వరు కూర్మిపట్టి యాతం డని
తూలనాడితి గదా ! మాళవేశు
తే. కుమతివై మాగధునిఁ బందుకోఁతి యంటి
వుత్కలేశ్వరు నొక పెద్ద యుష్ట్రమంటి
వాంధ్రపతి జూచి పెనుగోద యంటి వింక
నకట యే రాజు నిన్నుఁ బెండ్లాఁడుఁ జెపుమ. 4

క. నీచేఁ బరిభవ మందిన
రాచకొమరు లెల్ల నముఁ గరం బలుక మెయిన్
జూచెదరు నేన, నీ కీ
నీచోక్తులు గఱచి పలుక నేర్పితినంచున్. 5

క. తులువతనంబున నిమ్మెయిఁ
గలఁచితి మద్గౌరవంబు కడుకొను వగలన్
బాలియింప నున్న నిన్నిఁకఁ
గులపాలిక వని తలంపఁ గూడునె చెపుమా. 6

చ. అనుపమ భోగభాగ్యమహిమాస్పదులై, నడిసన్న రాజనం
దనుల వరింప నొల్లవ కదా! మదమోహితబుద్ధి, నింక ని
న్ననవరత ప్రతిగ్రహ సమాగతవిత్త నికృష్టవృత్తిమై
మనఁగల యొక్క బ్రాహ్మణకుమారున కిచ్చెదఁ జూడు
దుర్మతీ!

మ. అని రోషంబునఁ బల్కి పోయి వసుధాధ్యక్షుండు తత్పట్టణం
బున నానావిధశాస్త్రపాఠకలనం బొల్పారు విద్వన్మహా
జనముం బిల్వఁగఁ బంచి, యందొక విదేశబ్రాహ్మణ
బ్రహ్మచా
రి,నుదాత్తవ్రతు,భూరి తేజుఁగని,సంప్రీతాత్ముఁడై చెచ్చెరన్.

తే. వానిఁ దోడ్కొని వచ్చి యవ్వామనయన
నిచ్చి పెండిలిసేసి యత్తింటి కనిచె
ననుచు దుఃఖానలంబుతో ననుగమించె
మొగమెఱుంగని మగని నమ్మృగుద యపుడు. 9

వ. ఇట్లయ్యండజయాన, ప్రచండశాసనుం డగు తండ్రి పను
పున నవిదితస్వభావుండును నపరిచితుండు నగు నవ్విప్రకు
మారు ననుగమించి పాదచారిణియై పురబాహ్య ప్రదేశంబు
సొచ్చి పోవునది తన మనంబున. 10

క. "నిరుపమ విభవాస్పదు లగు
నరనాథకుమారు లెల్ల ననుఁ బ్రార్థింపన్
సిరి రా మోకా లొడ్డిన
కరణిన్, నిరసించి దైవగతి నిట్లయితిన్. 11

చ. అకట! సురాంగనావితతి యట్టి సఖీజన మీవలావలం
బ్రకటవిభూతిఁ గొల్వ; నిరపాయ సుఖోదయ చారులీల ని
ర్నికృతగతిం బురోపవనవీథి విహారము సేయు రాజపు
త్రిక యనె,యిట్లు కాల్నడ నధీరత,నత్తిలు సేరఁబోయెదన్.

చ. కడుకొను బాహుశక్తి రిపుకాండము నల్లల నాట్చు రాచవం
గడమునఁ బుట్టి యప్రతిమ గౌరవలీల బ్రివృద్ధిఁ జెంది, యె
వ్యెడలఁ గొఱంతలేని సముదీర్ణ శుభాకృతిఁ బొల్చుదాననై
కడ కొక పేదబాపని మగండుగ నోఁచితి నక్కట! దైవమా!

ఆ. దైవమేమి సేసె, ధనగర్వ తనుగర్వ
హతమనీష నిట్టు లైతిఁ గాక
యొరుల దూరనేల ? యోహో ! మదాంధుల
కింత కీఁడు మూఁడు టేమివింత ! 14

చ. అని తనుఁదాన దూఱికొని, యాత్మఁ గలంగుచు, బాష్పపూరముల్
గనుగవ ముంచిపాఱ, బతిఁ గానక భీతిలి వెచ్చనూర్చుచున్
బనివడి తన్నిరోధ మొకభంగి నిరస్తము సేసికొంచు, నా
తనిఁ బొడఁగాంచుచున్, బ్రితిపదస్ఖలనార్తిఁ గడున్ సహించుచున్. 15

వ. చనిచని, యమ్మందయాన నిజపురోభాగంబునందన యభాగధేయంబునుం బోలె, నతిభీషణంబై హరిశరభ కరిప్రముఖ నానాసత్త్వవిహరణాభీలంబును, వివిధ లతావలీ కుసుమ విసర పరిసరదమందమకరందరస తుందిల సమున్మదేందిందిరఝుంకారసంకులంబును, బహుతర తరువారిత శీతల తరచ్ఛాయా సముద్భూత ఖద్యోతకరనికరంబును, కీరశారికాద్యనేకవిధ విహంగమశృంగారంబును నైన యొక్క నిబిడకాంతారమధ్యంబుఁ బ్రవేశించి యమందరయంబునం

జనుచున్న యప్పుడుచుబాపని వెన్నడిం బోవుచు నయ్యా
వసరంబున. 16

సీ. గంధసింధురఘటా కటమదామోదంబు
పసివట్టు సింహశాబములఁ జూచి
సమదోగ్రమహిషభీషణవిషాణ శ్రేణిఁ
బడదాటు వ్యాఘ్రడింభములఁ జూచి
పటువిషానలఘోర ఫణిఫణామణికోటి
ధర దుల్చు ఘోరగృధ్రములఁ జూచి
ప్రతిభటీభవదచ్ఛభల్లగల్లచపేట
హతిరేఁగు మదవరాహములఁ జూచి

గీ. హృదయవేదనఁ గడుహెచ్చ నిచ్చఁ గలఁగి
వెచ్చనూర్చుచుఁ బలుమారు వేడినీరు
కన్నుఁగవ జాఱి, పాలిండ్లు గ్రమ్మి పాఱఁ
గలికి పతివెంటఁ బఱచె నగ్గలము వెఱచి. 17

చ. వెఱపున నిమ్మెయిం దనదు వీఁపున మూఁపున నంటివచ్చు న
త్తెఱవ తెఱంగెఱింగియు గతిస్ఖలనం బొకయింతలేక క్రి
చ్చఱఁదనత్రోవఁదా నరుగు నంతియకాని,యొకప్పుడైన గ్ర
మ్మఱి యటుసూడఁడా ద్విజకుమారుఁ డదేమి విచిత్రమో
కదా! 18

లే. కంటకశ్రేణి వోని యక్కఱకురాలఁ
దగిలి, నెత్తురు లురులు పాదములతోడ
నవయవములెల్ల సడలి నొవ్వడరుచుండ
నెంత దవ్వని పఱచు నయ్యిందువదన? 19

సీ. "కటకటా! తానెంత కఠినచిత్తుఁడో కాని
మరలియైనను జూచి యెఱుఁగఁ డితఁడు
బాపురే! తనపాలఁబడ్డ దౌర్భాగ్యగా!
యని యొకించుక యైన నాదరింప
డక్కటా తాన దిక్కని నమ్మి యున్న నా
దురవస్థ కాత్మలోఁ దూపటిల్లఁ
డతిసుకుమార యీ యబల తా నిపుడెంత
యలసెనో యని కొంచె మైన నిలువఁ

గీ. డింక నేనేమి సేయుదు నెందుఁ జొత్తు
దాహ మగ్గల మయ్యె సంతాప మడరె
తనువు నిలువదు ఘోరకాంతారసీమఁ
జావ వ్రాసితే "విధి"! యంచుఁ జాన యడలి. 20

ఉ. హా! యని, నేలఁగూలుటయు నంతకుమున్న యొకింతదవ్వుదాఁ
బోయిన విప్రనందనుఁ డపూర్వగతిం జెలిపాటుసూచి యో
హో యనుచున్ వెస న్మరలి యుజ్జ్వల గాఢకృపానురాగ లీ
లాయితమూర్తియై సముపలాలన నిర్మలబుద్ధిఁ గూడగన్.

ఆ. మగువఁ జేర నరిగి మందమంద మృదూక్తి
కొంత సేదఁ దేర్చి కుసుమవిసర
హారిబహులతాసమంచితం బగు నొక్క
నిబిడపాదపంపునీడఁ జేర్చి. 22

చ. "సరసిరుహాక్షి! కూరమృగజాలభయానకమైన కాననాం
తరమున, నుండఁగూడమిఁగదా నిను నిమ్మెయి వేగిరించితిక్
భరఁపడియైన భీతి నెడఁబాయకవత్తువకాఁ దలంచి యి
ట్లరుగుట నీతియయ్యె నకటా! కడునొచ్చితి వింతమాత్రకుక్.

తే. తరుణి! నీ తండ్రి దగు రాజధాని వదలి
యలుక నర్ధార్ధయోజనం బధిగమించి
తదిదె సుమ్ము తదీయ సీమాంతభూమి
యవలఁ జని నిల్త మదియు నా యభిమతంబు. 24

క. అని యిట్లు చతురగతి న
వ్వనజేక్షణ ననునయించి వారక తాఁ దె
చ్చిన మంచినీరు ద్రావిం
చిన నించుక సేదదేరి చెలి నడ తేరక్. 25

తే. అల్ల నల్లనఁ గొంత దవ్వరిగి నాఁటి
కొక్క గ్రామాంతరము సేరి యుర్విసురుఁడు
తదుపవనవాటి నొక్క పాదపమునీడ
వెలఁదినుంచి పదార్థముల్ విలిచి తెచ్చి. 26

సీ. నీనేర్చు చందాన నెలఁత పాకము సేసి
కొని భుజింపు మటన్నఁ గోమలాంగి
తానేర నని చెప్పఁ దలఁకి సిగ్గున నుండ
నది యెఱింగి మహీసురాన్వయుండు

పొలఁతి కంతయుఁ దాన బోధించి యిటు సేయు
మనవుఁడు నెదురాడ కట్లు చేయ
నామెయుఁ దాను నింపలర సాపడి లేచి
యారాత్రి నంతయు నందుఁ గడపి

గీ. వేఁగెఁ బయనంబు గావించు వేళయైన
మించుఁబోణిని సంప్రీతి మేలుకొలిపి
సదరహాసమనోజ్ఞభాషణము దాని
కింపు సేయంగ, నమ్మగం డిట్టు లనియె. 27

సీ. "చండశాసనుఁడు నీ జనకుండు వనిచిన
నబ్జాక్షి నిన్నుఁ బెండ్లాడవలసె
ప్రభుపుత్రి వనియెడు భావంబు వోనాడి
కులకాంత వను బుద్ధిఁ గూర్పవలసె
విషమపాషాణ దుర్విధ ఘోరపథమున
భీతిమై నిను నడపింపవలసె
నలసి నిద్రించెఁ బొమ్మని యుపేక్షింపక
తెలవారకుండ మేల్కొలుపవలసె

గీ. నకట! యిట్టి యకాండదుఃఖానుభవము
పరగఁ దొలిమేనఁ జేసిన పాపఫలము
దానిఁ దప్పింప నెవ్వనికైనఁ దరమె?
పయనమగు మింక ధైర్యంబు పట్టుకొలిపి. 28

ఉ. నావుడు శోకభారము మనంబున కెంతయు జల్లనైన నా
భూవరపుత్రి మానమదమోహవిజృంభము వాసి వానితోఁ

బోవఁదొడంగెనెందునువిభుల్ సమయోచితవాక్యమైత్రియా
కోవిదులైనచోఁ జెలులకున్ మదగర్వము లుండ నేర్చునే. 29

వ. ఇట్లా ద్వితీయదివసంబున నతిప్రసన్నవదనయై పతి ననుగ
మించి చనుచున్న యన్నాతుక తనమనంబున.

చ. "ఇతఁడొక దేవతుల్యుఁ డగు టేర్పడుచున్నది; రూపురేఖ ల
ప్రతిమము లీ తనుద్యుతి కరం బరు ది వ్వసుధాతలంబునన్
జతురుఁ డుదారసత్త్వవిలసద్గతిశాలి ప్రసన్నుఁడయ్యు నా
కృతిగరిమంబునం గడు నధృష్యుఁడ యివ్విభుఁ డెల్లభంగులన్

క. హరి శరభ ప్రముఖ భయం
కరసత్త్వప్రకర ఘోరకానన సీమన్
జరియించు వేళ నింతయుఁ
బొరయద భయవికృతి యితని ముఖపద్మమునన్. 31

ఉ. ఇట్టి విశేషముల్ వసుమతీశకుమారులయందుఁ గానకే
నట్టెటు సేసినందున గదా! చలపట్టి నృపాలకుండు నిన్
బుట్టుదరిద్రుఁడైన యొకభూసురపుత్త్రున కిత్తునంట యా
కట్టడ నాకు నిగ్రహముగాక యనుగ్రహ మయ్యె నియ్యెడన్.

వ. అని పలుఁదెఱంగుల విచారించి యతం డెల్లవిధంబులం
దనకు మగం డగుట కర్హుండై యున్నవాఁడని నిశ్చయించి
సంతసంబునం బోవునది నవవధూత్వైక హేతుకం
బయిన లజ్జాభరంబునం జేసి, హృదయేశ్వరు చతురసంభాష
ణంబులయెడం దనకుం గలుఁగు మనస్సుఖంబు ముఖవికాస

మాత్రింబునం జూపుచుఁ, గతిపయప్రయాణంబుల భర్తృ
నివాసదేశంబు సేరి, యచ్చట. 33

సీ. సరసవానీరప్రసవ సౌరభోదార
శీతాంబు వగు నొక్క చెఱువు పొంత
కాఁపులేజవరాండ్ర కలకలార్భటులచేఁ
గర మొప్పు కేదారగణము నడుమ
నానాలతాప్రసూనసపినద్ధ శేఖర
ద్రుమసాంద్ర మగు నొక్క తోఁటలోన
కమనీయ నవమాలికాజాల సంవృతం
బయి యొప్పు మంటపాభ్యంతరమున
గీ. అల్పమయ్యును నభిరామమై తనర్చు
మందిరము సొచ్చి యతని కానంద మొదవఁ
గాపురము సేయఁ గడఁగె నేకాంతవృత్తి
యా మహారాజపుత్రి దివ్యత్సుగాత్రి. 34

చ. అనుదినము ప్రభాతసమయంబుల మేల్కని, నాథు వెంట నో
య్యనఁ జని తత్తటాక సలిలాంతరసీమఁ గృతావగాహయై
వనజదళాక్షి, తా మరలివచ్చి కృతాహ్నికుఁడైన భర్తకుఁ
మన మలరంగ వంటకమమర్చి ప్రియంబునఁ దెచ్చునిచ్చలుఁ.

తే. అతఁడు బోసేయఁ బిదప తా నారగించి
వినయ మలరార, నొక కొంత విశ్రమించు
నవుల సాయంతనార్హ కృత్యములయందు
నెలమి మదమానరహితయై మెలఁగుచుండు. 36

తే. ఒక్క పరిచారికయ కాని యొరులు లేని
యవ్వనాంతర్గృహంబున నధిపుతోడఁ
గాపురము సేయుచున్న యక్కమలనయన
నాఁడు నాఁటికిఁ దొంటియున్నతియ మఱచి. 37

చ. పతిమదికిం బ్రియంబెసఁగు భంగిఁ జరించెడు వేడ్కదక్కఁద
చ్చతురవచోమరందరుచి సంస్తవకౌతుకవృత్తిఁ దక్క న
ద్భుతమగు తత్తనూవిభవముం గమదిమెచ్చుటఁదక్క మన్మథో
ద్ధతిఁ దలపోసి బెగ్గిలుటఁ దక్కమ తెద్దియు లేకయాత్మలోన్.

క. ఇలుసేరి యిప్పు డాఱవ
నెల నడచుచునున్నయది వినీతాత్మకనై
మెలఁగుట తాన యెఱుఁగు న
న్నెలమిం దనసెజ్జ చేర్పఁ డిది యేమిటికో ? 39

తే. పృథుమదక్రోధవివశనై పెండ్లినాఁడు
తన్నెఱుంగక చేసిన తప్పుఁదలఁచి
యింత చలపట్టినాఁడు ప్రాణేశ్వరుండు
నేటి దలిర్పంగ నింక మన్నించుటెట్లు ? 40

చ. వలవనియల్క నుగ్రకరవాలముఁ గేల ధరించి, యిందురాఁ
దలఁ దెగవ్రైతునం చతిమదంబున నత్రొలుపాన్పునాఁడు నా
పలికినపల్కు డెందమున బాకయినొప్పి యొనర్పకున్న నా
లలనుఁడు నన్ను నేఁడును నలక్ష్యమతి న్మరుపాలు సేయునే.

చ. రసికత పెంపునన్, దదనురాగము సొంపు బ్రసన్న హాసము
ల్లసనపుటింపుఁ జూచుచుఁ దొలంగెడుమామక మానముద్రత
ద్వ్యసనపరాఙ్ముఖత్వము నుదాత్తగుణంబు నధృష్య తేజమున్
వసమఱి చూడఁదాసడలువాఱకనిల్చి నిఁకేమి సేయుదున్.

సీ. ఉత్తమక్షత్రివంశోత్పన్న నగుటచే
నభిమానగుణము జన్మానుగతము
వనితాత్వదోష సంవళితనై యునికిచేఁ
బటుసాధ్వసంబు స్వాభావికంబు
వ్రీడావరోధ సంవృతచిత్త నగుటచే
నభిసరింపంగ సాహసము లేదు
స్వకృతాపరాధ పశ్చాత్తప్తనై యున్కి
బతిమోము సూడ ధైర్యంబు గలుగ

గీ. దకట! యే నిట్టిదానఁ దానై కడంగి
చతురవర్తనకలన లజ్జాభరంబు
సడలఁ బైకొన వలసిన జాణ యిట్లు
నన్నుపేక్షించెఁ దొంటి దుర్నయముఁ దలఁచి. 43

తే. తన పురోభాగమున నున్న తఱి మదీయ
హృదయమునఁ బుట్టు వికృతులు, వదనముకుర
మందుఁ గన్పట్టఁ జూచి నాకంటెఁ దొలుతఁ
దాన మొఱఁగి కదా! మనోధవుఁడు నగుట. 44

ఉ. ఇంత పరేంగితజ్ఞుఁడగు నీతరుణాగ్రణి, నా మనోగతం
బంతయు మున్న తానెఱిఁగియైనను, నన్నిటు లేఁచుచుంట నే
కాంత పదప్రణామకలనాభిహితస్వసమర్పణార్థ నా
నంతకుఁ జేరఁదీయమి యథార్థము, యేనిఁక నేమిసేయుదుర్.

వ. అని కొంతవడి విచారించి వెండియు నయ్యండజయాన తన
మనంబున. 45

క. "కాసి, యేసీ మార్గ్యముఁ
బోనాడి నిజేశు హృదయమున కింపగు చం
దానం బూని చరించెద
నేనిం, దప్పేమి చూత మీరే" యనుచుర్. 46

వ. సాయంసమయవిహితంబులగు, ననుష్ఠానంబులు దీర్చివచ్చిన
మగని నభిమతాహారంబుల సంతృప్తునిం జేసి, తానును
భుజియించి, యుచితపరిధానధారిణియు, నర్హాలంకార
భూషితయుఁ, గుసుమవిసరోపశోభితకేశపాశయునై, యవ్వ
సంతసమయంబున నవమాలికామంటపంబున కవ్వలిబయల
శరచ్చంద్రచంద్రికాధవళం బగు తల్పంబుపై విమలగగనాం
గణంబునం దోతెంచు, నమృతకరమండలంబుం గాంచుచు,
నవ్వెన్నెలవెలుంగునం దనమనోహరాంగంబు లపూర్వశో
భావిశేషంబునఁ జెన్నుమెఱయం, గూర్చున్న యన్నవ
యవ్వనుం జేర నరిగి, తత్సవిధదేశంబునం దొకచోట
నిజనిసర్గచాపలభావంబుం దొఱంగి, నేలకుం డిగ్గివచ్చిన

విద్యుల్లతికయుం బోలె, నావిద్యుత్ప్రభ పదాంగుష్ఠంబున నవనితలంబు రాయుచు నిల్చియున్నం జూచి, యవ్విభుండు సాదరదరహాసమధురంబుగా నల్లన యప్పల్లవాధర కిట్లనియె. 47

ఉ. "నీవదనాంబుజంబునకు నీరజవైరి విరోధిగాఁడొకో !
భూవరపుత్రి! యేల యిటు పొల్పువహించిన దిప్డు కౌముదీ
దేవత నీదు లేనగవు తేటలకుక్, గడు నాస సేయు నో
హో! వెరవారఁ బ్రాణసఖియుంబలె నిన్నిపు డేల కొల్చెడున్.

సీ. కలహంసగమన! రాకకుఁ గారణం బేమి ?
కడుఁగ్రొత్త యివ్వేషకలనఁ జూడ!
మానముద్ర సడల్చి మాటాడ వచ్చితే?
యింత సాహసము నీ కేల కలిగె ?
నాయొద్ద నిట్లు లెన్నడు నిల్చినది లేదు
నెమ్మి నై నేఁ డేల నిలువవలసె ?
మనసులో నేమున్న, మగువ నాతోఁ జెప్పు
మది ధర్మమైన నే నడ్డుసేయఁ

గీ. గౌముదీదర్శనోత్సవాకలన నిందుఁ
జొచ్చియుండిన నీవిటు సూడ నేల ?
చూడు మదె చంద్రికాధౌతశోభమాన
వనలతారాజి యున్నది వామనయన!" 49

చ. అని తనుఁజూచి యుల్లసములాడెడు చందముకాగనెమ్మదిం
దనికిన యమ్మనోజపరితాపము దా గుఱితించి పల్కనా
ధుని వదనంబు లేనగవు తొంగలిరెప్పల నాచికొంచు న
వ్వనజదళాక్షి సూచె నిడువాలుకనుంగవ యోరచూపులన్.

క. తను నిట్లు సూచు వనజా
నన నల్లనఁ జూచి విప్రనందనుఁడు ప్రియం
బునఁ గూరుచుండు మని పని
చిన, లజ్జావినయభయవిశిష్టాకృతియై. 51

వ. ఆమె యా శయ్యాతలంబున నాతని కించుక దూరంబుగాఁ గూరుచుండి, యిటునటు సూచుచుండ నక్కుమారుం డొండుతలంపు లుడిగి, మానంబుఁ గైకొని సాంద్రచంద్రాతపసమాక్రాంతం బగు నవ్వనాంతంబు పయిం దృష్టివఱపి, కార్యాంతర నిమగ్నుండునుంబోలె నూఱకున్న నన్నలి నాస్య యతని యయ్యుపేక్షకుం దన తొంటి యపరాధంబు కారణంబుగా నెఱఁగికొని నిట్టూర్పులు వుచ్చి కన్నీరు గార్చుచు లేచి తత్పదపద్మంబుల పయింబడి గద్గద వచనంబుల "నాయపరాధంబు సహించి నన్నేలరే!" యని ప్రార్థించుటయు నయ్యవసరంబున. 52

చ. రమణినిఁ బ్రీతిమై మృదుకరంబుల నల్లనఁ బట్టియెత్తి సాం
పమరఁ గవుంగిటం బొదివి యశ్రుజలంబు నిజోత్తరీయచే
లమునఁ బొరింబొరిం దుడిచి,లాలన సేయుచు "నేలయింత శో
కమునఁ గలంగె దీవు శుభగాత్రి నిజం బెఱిగింపు"నావుడున్.

క. పతిఁ జూచి వినయసంభ్రమ
వతియై యమ్ముగుద "ప్రాణవల్లభ మీ రీ
గతి నన్నుపేక్ష సేసిన
మతి నొవ్వకయున్నె" యని యమందవ్యథతోఁ. 54

తే. మఱియుఁ గన్నీరువెట్టిన మనసు గఱఁగి
మదనపరవశుఁడయ్యె బ్రాహ్మణసుతుండు
మంజువాణి మనోజ్ఞసంభాషణంబు
విను కుతూహల మాత్మలో వెల్లివిరియ 55

వ. అల్లన నప్పల్లవాధర కుల్లంబు రంజిల్లు మధురవచనంబుల నిట్లనియె.

సీ. "అత్యుగ్రవీరవంశావిర్భవవు నీవు;
పరమసంయమి కులోద్భవుఁడ నేను
బహుల సామ్రాజ్య సంపద్వివర్ధిత వీవు?
సతతదారిద్ర్యసంశ్రయుఁడ నేను!
ప్రవినూత్న భోగానుభవకుతూహల వీవు;
పరమవైరాగ్యనిర్భరుఁడ నేను
ప్రభుతాభిమానవిభ్రమతీవ్రమతి నీవు;
శమదమారంభనిశ్చలుఁడ నేను
గీ. ప్రకటరూపావలేప సంభ్రమ నిరస్త
సకలరాజన్యసుతవీవు, చారుగాత్రి
యనభిమత వేషభూషావిహారకలిత
వర్తనుఁడ నేను, నన్ను నీ వలచు టెట్లు? 5

చ. వలచితివో, స్వభావగుణవశ్యవుగాక, స్మరైకలోలవై
కలఁగెదు నిన్నుఁ బొంది కులగౌరవకారణభవ్యసంతతిన్
జలజదళాక్షి నేఁ బడయఁజాలుదునే యటుగానినాఁడు కే
వలసుఖవాంఛ ధర్మపథవర్తన నిమ్మఁ దొలంగఁ బాడియే."

చ. అనుటయు నా సరోరుహదళాయతలోచన, తొంటిసాహసం
బును ఘనలజ్జయున్ జనవు పొల్పున నుద్ధతకామపీడనం
బునను దొలంగిపోవ, బరిభూతి జనించిన కోపవేగమున్
దనమదిలోననాగికొని ధైర్యము పెంపుననాథుఁ జూచుచున్.

తే. "అకట ! ప్రాణేశ ! న న్నిట్టు లాడఁదగునె ?
నీకు గుణవశ్యనై యున్కి యీవ యెఱుఁగు
దేల నాచేతఁ జెప్పింప, నిదియుఁ గాక
యన్యకాంతనె ? నేను నిల్లాలఁ గాని. 60

క. పితృకృతవివాహకలనం
బతిగా నినుఁ బడసి, పిదప భవదీయ మహా
మతికిఁ దనుద్యుతికి గుణ
ప్రతతికి వశనైతి నిపుల వల పుదయించెన్. 61

తే. అవిదితభవత్ప్రభావనై యలుక వొడమి
యపుడు తొలుదొల్తఁ జేసితి నవినయంబు
ప్రాణనాయక! నేను నీపాదసేవ
పరమభాగ్యంబుగాఁ జూచు భార్యనైతి. 62

తే. నాథ! యేఁ నిట్టిదానఁగా నమ్మవేని
నాకు నీదు పదారాధనంబె చాలుఁ
బ్రీతిమై నోర్తు; బెండ్లాఁడి పితృకులంపు
ఋణము దీర్పుము నాకేల రిత్తవగపు. 63

క. న న్నొల్ల నంటి వనియే
ని న్నొల్లక యునికి శాస్త్రనింద్యము గాదే!
మున్నెఱుఁగ కేమి సేసినఁ
జన్నే? యిపు డెఱిఁగి యెఱిఁగి సమయము దప్పన్. 64

చ. పతి వను భక్తి నీదగు ప్రభావము భావనసేయుచో శుభా
కృతి మదిఁ దోఁప, జవ్వనపు గీడున మారశరాహతాత్మనై
మతి సెడి దాన నిట్టి యవమానము సెందితి, నైననేమియు
క్తతనభవస్మనం బెఱుఁగఁ గంటిఁగదా యదిగాక వెండియున్.

తే. సకలహృదయాధివాసి యీశ్వరుఁడు సాక్షి
గాగ నాహృదయంబు నిక్కముగఁ దెల్పి
యేను నిర్దోష నైతి మహీసురేంద్ర
తనయ! నన్నిఁకఁ బోవని మ్మని వచించి. 66

వ. సాసూయంబును సామర్షంబును నైన యనాదరావలోకనం
బునం దన్నుఁ జూచుచు, నిజభుజాబంధంబుఁ ద్రోచికొని
పోవంబోవు నప్పూవుఁబోఁడిం దెరల విడువక, సాదరదర
హాసమధురంబుగా నక్కుమారుం డిట్లనియె. 67

ఉ. "ఓనరపాలవంశ కలశోదధి చంద్రికలా! కలామహో
ద్యానవనే విహార కలనాకుల కోకిల! కోకిలస్వనా
నూనమనోజ్ఞ! తావక మృదూక్తి సుధారసపాన కౌతుకా
ధీన మనస్కతం బలికితి న్నిను, నమ్మయిఁ దప్పు సైపుమా.

చ. ఎఱుగనె? నీమనంబు తెఱఁగేర్పడ నో సరసీరుహాక్షి ని
న్నఱిముఱిసేయఁ బుష్పశరుఁ డక్కట నన్నెఱుగండె నీవు గ్ర
చ్చఱఁ జనుదెంచునంతకు స్మరార్తిసహించితి నంతెకాని యి
త్తఱి నినుఁ దప్పఁదోచి పరితాపభరం బిక నోర్వ శక్యమే?

సీ. కోరివచ్చిన రాచకొమరుల లోపముల్
సూచించి విడిచిన సూక్ష్మబుద్ధి
జనకుండు చండశాసను డంచు వెఱవక
తలవారు గొన్న స్వాతంత్ర్యకలన
తెలిసి నావలఁ దొంటి తెగువకు రోసి న
న్నారవించెడు గుణగ్రహణశక్తి
యెన్నికష్టము లున్న నేవగింపక భక్తిఁ
దలకొల్పి పతిఁ గొల్చు ధర్మనిష్ఠ

గీ. సమయ సముచితవర్తనోత్సాహ గరిమ
పరగ నిటవచ్చి చూపిన భావశుద్ధి
వనజదళనేత్రి! మానసావర్జనమున
కెంత సాలవు, నిన్నిపు డేల విడుతు. 70

క. ఐనను నొక్కటి సెప్పెద
మానవతీ! వినుము నీ సమంచితగుణముల్
మానినికిఁ దగవు; పురుషున
కైనఁ శోభించు నిది యథార్థము సుమీ! 71

చ. వినయముఁ దాల్మి సాధ్వసము వ్రీడయు బంధుజనానురాగముం
దనుతయు, మార్దవంబు, నివి తన్వికి నైజగుణంబు లిట్టి వె
ల్లనుగల కన్నియల్ దమతలంపులు మున్గఱి సేసి యెందునుం
జనకవిధేయలై పితృవశంవదవృత్తిఁ జరింతు రెప్పుడున్. 72

తే. మగువలకు యోగ్యగుణము సౌమ్యత్వ మరయ
పురుషులకుఁ జూడ యర్హంబు భూరితేజ
మధిక తేజో నిరస్త సౌమ్యస్వభావ
లైన పొలఁతుల పొందొల్ల రలఘుమతులు. 73

ఆ. ప్రథితపురుషగుణవిభాసితం బైన సు
క్షత్రియాన్వయమున జన్మమగుట
తెలవ! దుర్నివార తేజోవిశేషంబు?
ప్రకృతియంద నీకుఁ బట్టువడియె. 74

క. దానికిఁ దోడుగఁ బ్రభుతా
శ్రీనిరతియు నై దుష్టవిశేషంబును నీ
లో నెరసి యంగనార్హగు
ణానీకము గప్పిపుచ్చె నది హేతువుగన్. 75

సీ. పరిహాసించితి నృపప్రవరపుత్రికులను,
తల్లిదండ్రుల పెంపుఁ దలఁపవైతి
పాలింపవైతి సద్భక్తిమైఁ బిత్రాజ్ఞ,
విభునిపైఁ జేయెత్త వెఱవవైతి
పాటింపవైతి దాంపత్యధర్మవిభూతి
లోకనిందలకైన లొంగవైతి
వదలలేవైతి దుర్వహగర్వపరిభూతి
నాడుదాన నటంచు నరయవైతి

గీ. పదియు నాఱేండ్లు నిండిన బాలవయ్యు
జీవితానంద హేతువౌ సిగ్గువిడిచి
యిన్ని పోకలఁ బోయితి వీవు దొలుత
నెంచ వైతివి రాఁగల యిడుమ లెవియు. 76

తే. రమణి ! యభినవ యౌవనారంభవేళ
వినయలజ్జాస్మరాలసవృత్తి విడిచి
దురభిమాన మదక్రోధ దూషితాత్మ
వై చెలంగితి పెద్దల కాత్మఁ గలఁగ. 77

తే. తండ్రి తనపాపుఁ దప్పించి, తలఁగఁ ద్రోయ
దురభిమాన ప్రభావంబు దొలఁగిపోయె
మామకాధీనవృత్తిచే మదము సనియె
నస్మదాదరమునఁ బోయె నాగ్రహంబు. 78

వ. మఱియును. 79

మ. ప్రతిభాగర్వము మాసె మామకమతి ప్రాగల్భ్యసంపత్తి ను
ద్ధతవిద్యామద మేగె నస్మదురువిద్యాపాటవప్రక్రియన్
సతతంబున్ మదుదార తేజమను భాస్వద్రోచిరా క్రాంతిచే
బ్రతిభాసింపక పోయె నీదగు ప్రతాపజ్యోతి నిస్తేజమై. 80

తే. దైవ మనుకూలమతి నింత దారసిల్ల
నిపుడు ప్రకృతిస్థలై యిట్లు తీగఁదెంచి
తిట్టి సంఘటనము కల్గదేనిఁ జెపుమ
నీవు దాంపత్యధర్మముల్ నిర్వహింతె." 81

చ. అని దరహాసభాసుర ముఖాంబుజుఁడై తనుఁజూచుప్రాణనా
థునిమఱిచూడసిగ్గుడుఁ,దొయ్యలిమోముటుఁద్రిప్పనమ్మొగం
బునఁగనుపట్టె నష్టాకయపూర్వమనోహరమాగ్ధ్యలీలవ,
య్యనుపమలీలకున్, వివశుఁడై ద్విజరాజ సుతుండు
నెమ్మితోన్.

శా. సయ్యాటంబులకుం గడంగి విలసత్సాహిత్య సాహిత్య వా
క్యయ్యాపాక చమత్క్రియాకలన; నుత్సాహంబు
పుట్టించుచున్
డయ్యింబొఱని తన్నిరోధముల కీడంబోక బల్తాల్మి న
మ్ముయ్యారేడులబాలఁ దేల్చె మదనాంభోరాశి
లోలోర్ములన్. 83

తే. ఇట్లు నవసంగమమున నయ్యుగురుఁబోడి
యుల్ల మానందవార్నిధి నోలలార్ప
సొబగుమైఁ బవ్వళించె నా సుభగుఁ డపుడు
మలయపవనాంకురములు శ్రమంబుఁ దీర్ప. 84

తే. అధికలజ్జాభరంబున నడఁగి మడఁగి
యధిపు పొదిగిటఁ జిక్కి శయ్యాతలమున
రతిపరిశ్రాంతయైన యా రాజపుత్రి
యోర కొదిగి పరుండె నేత్రోత్సవముగ. 85

తే. అవనిపతిపుత్రి యష్టాదశాబ్దకలిత
పంచవింశతిపూర్ణుండు బ్రాహ్మణుండు
తమకు నిర్వుర కదియ ప్రాథమికసుఖము
వారి మైమఱపుల కేల వర్ణనంబు? 86

తే. వలఁగొని ప్రభాతవాయువుల్ పొలయుచుండ
ఫులుగుతండంబు లెఱలకై మోఁగుచుండ
నినుఁడు పూర్వాద్రిపై బారె డెక్కుచుండ
గాఢనిద్రాభరంబునఁ గానరైరి. 87

తే. సాంద్రతరవనపాదపచ్ఛాయలందు
నిబిడదళమధ్యమున నల్ల నిర్గమించి
చొచ్చు బాలార్కతిర్యగంశువులు గొన్ని
మోముపై వ్రాల మేల్కాంచి మునిసుతుండు. 88

తే. తనదు కౌఁగిలి సడలింపఁ దరుణి లేచి
సిగ్గు పెంపునఁ దల్పంబు డిగ్గనుఱికి
యవనతాననయై పోవ నతఁడు లేచి
ప్రాతరాహ్నిక సత్క్రియాపరతఁ జనియె. 89

క. ఓజోనిధి యగు నయ్యం
భోజనుఁ డను విప్రతనయుఁ డదిమొదలుగ న
త్తేజోవతి విద్యుత్ప్రభ
యోజమెఱసి కొలువఁ గడు సుఖోన్నతిఁ బొందెన్. 90

క. సలలిత సముచిత వర్తన
కలనం జెలిఁ దేర్చు నిపుణు కథఁ దెలిపెడు న
న్నల వెంకటసుబ్రహ్మ
ణ్య లసత్కావ్య మిది బుధమనోహర మగుతన్. 91



శ్రీః

# ప్ర వా సి



## i

పున్నమ నాఁటి రేయి; పరి♦పూర్ణ సుధాకరమండలంబు లో
కోన్నతలీల దోప గగ♦నోపరిభాగ మలంకరించె; నెం
దు న్నగరంబు వీథులఁ గ♦నుంగొన నొక్కమనుష్యుఁ డేనియుం
గన్నులకుం గనంబడఁ డ♦ఖండితచంద్రిక యొండు దక్కఁగన్.

నిర్మల రూపమై ♦ నిశ్శబ్ద దేవత
వీథివీథులఁ దాండ♦వించు వేళ
నిఖిలప్రజాళిపై ♦ నిద్రా మహాదేవి
మించి యానతి చెలా♦యించు వేళ
పూచిన పరువంపుఁ ♦ బువుబంతులం జోపి
వి న్ననువై గాలి ♦ వీఁచు వేళ
నెలజాలుచాలు చే♦రులతూఁగు టుయ్యేల
హాయిగాఁ బ్రకృతి తూఁ♦గాడు వేళ
తారకానాథు కనుసన్నఁ ♦ దగిలి రాత్రి
మమతఁ బ్రణయామృతాప్తి మై♦మఱచు వేళ
జగతి యానందపూర్ణమై ♦ జ్ఞానివోలె
నిస్తరంగ సముద్రమై ♦ నెగడు వేళ.

గగనము పూలపందిరి; ని♦గారపు వెన్నెలచాలు తీవ; లం
దుఁ గనఁగవచ్చు చుక్కలువి♦నూత్న సుమంబులు; మధ్యసీమలన్
నిగనిగలాడు చంద్రుఁడు గ♦ణింపఁ బ్రఫుల్ల సుమోరుగుచ్ఛ; మం
దగపడు మచ్చ తేఁటి; జగ♦మంతయుఁ గన్పడెఁ బూలతోఁటగన్.

ఆ లలిత సాంద్ర చంద్రికా ♦ డోల నునిచి
లీల నిశ్శబ్దగీతిక ♦ జోలపాడి
నవనవ ప్రేమ విశ్వ సం♦తాన వితతి
బడలికలు వాయ జోకొట్టెఁ♦బ్రకృతితల్లి.

కళగల చందమామ తమ♦కానఁ గరంబులు సాఁచి కల్వబు
గ్గల గిలిగింతలన్ గొలిపి ♦ కైరవిణిన్ వలపించె, దావులన్
మలయు సమీరుఁడున్ గుసుమ♦మంజరి చన్గవ సోఁకి కన్నె తీ
వెలఁ జివురాకుఁజేతులఁ గ♦వించి సుఖించె రసప్రసంగతిన్.

కళలరాయండు కూర్చు మ♦గండటంచు
ముందుఁ బొడసూపు నిశయు మి♦న్నందు నట్టి
తారకలు మోమునను వెల్ల♦దనమునందె
నతఁడు కైరవిణీప్రియుం ♦ డగుటఁ దెలిసి.

పాలవారాశిము♦త్యాలవెల్లి మునింగి
కలికి చుక్కలు చింద♦జలకమాడి
తొలిగట్టు తీరాన ♦ నిలిచి సంజమెఱుంగుఁ
దడికుసుంబాచేలఁ గడకుఁద్రోసి

తటిఁ బ్రాగ్దిశయొసంగు ♦ ధవళాంశుకముఁ దాల్చి
పండువెన్నెల వలె♦వాటువైచి
పులు గడిగిన ముత్తె♦మును బోలె సాగి యా
కసపుఁబై వీథి సి♦కారు వెడలి
తన కళానిధిసంజ్ఞ సా♦ర్థకము గాఁగఁ
గరములను జాపి తొవకన్నెఁ ♦ గాఁగిలించి
కొలఁకుటద్దాలఁ దమదు నీ♦డలను జూచి
నిండువేడుక మిన్నందె ♦ నీరజారి.

గగనకబరీభరాన న♦క్షత్రకుసుమ
సరములను మెలమెల్లనఁ ♦ గరమువైచి
సస్మితానన యగు నిశా♦శ్యామ కపుడు
చందురుఁడు సూపెఁ బ్రకృతి ప్ర♦శాంతశోభ.

అకలంకప్రణయస్వరూపుఁ డగు నీ♦హారాంశు డెందాన డా
గకతోఁచెన్ దొవకన్నెచిన్నె; యతఁడున్ ♦ గన్పించెఁ దచ్చిత్తక
ర్ణిక నచ్ఛాచ్ఛరసానుబింబిత తనూ♦న్మేషాన; నన్యోన్య తు
ల్యకళాధన్యము వో ప్రియప్రణయ మే♦లా దూరమైనన్ జెడున్.

నునుసిగ్గు దొంతర♦లను గానక నొసంగి
తనియించు గోలల ♦ కనుల జళుకు
పయ్యెదఁ జేడాచి ♦ పట్టీక తమలంబు
నందిచ్చు నడిముద్ద♦రాలి యలుకు

వాలుఁగన్నుల నగు ♦ వాలకంబులు దోఁపఁ
బ్రక్కఁ జేరెడు జవ♦రాలి కులుకు
విరులమాటులఁ బ్రేమఁ ♦ గురియించి నగవు సొం
పులఁ బైఁట సరిదిద్దు ♦ ప్రోడ బెళుకు
వలచి వలపింపఁ దమకానఁ ♦ గలసి మెలసి
తలఁపు మీఱఁ బునారతి ♦ నెలసి సొలసి
చెలువల కవుంగిళుల మేను ♦ మలసి యలసి
నిదురఁ జెందిరి ప్రియులు వె♦న్నెల బయళ్ల.

ఆ మనోహర చలితాని♦లాంకురముల
నిరుపమానంద మొసఁగు వె♦న్నెల తునకలఁ
గన్ను లరమోడ్చి మోద సా♦గరమునందు
మునుఁగని సజీవ మా జగ♦మునను లేదు.

సరసులపై విరాళిఁ జన♦సాగెడు కామిను, లాత్మకాంతలన్
గుఱిచి రయంబు పూఁబొదల♦కున్ జనఁజూచెడుజాణ; లంగజా
తుర లగు కాంతలన్ బ్రియుల♦తోఁ గలుపన్ బలుపాటులందు నే
ర్పరులగు చేటులైనఁ గను♦పట్టరు వీథులఁ బ్రొద్దుపోవుటన్.

ఎల్ల జగంబు నాత్మ సొగ♦యించెఁ బ్రియాకృతివోలె నిద్ర; రం
జిల్లెఁ బ్రశాంత కాంతుల్; లోక♦చీమచిటుక్కనమాట మ్రోఁగునా
చల్లని వేళలన్ బ్రకృతి ♦ సౌఖ్యజయధ్వనివోలె మ్రోసె న
ల్లల్లనఁ బ్రక్కయింటి గడి♦యార మొగిన్ బదిరెండు గంటలన్.

కువలయంబునఁ జెలువలఁ ♦ గూడి మాడి
మమత రసికాళులెల్ల మో♦దమున నుండఁ
బద్మమున భృంగ మంగనఁ ♦ బాసి కుందు;
మందభాగ్యున కెట్టు లా♦నంద మబ్బు?

ii

అది సుకుమారమందమధు♦రానిలరంగము; రమ్యచంద్రికా
స్పదము; మనోజ్ఞమందిర వి♦శాలతరోపరిభాగ; మందుపై
నదికిన పాలగారయను ♦ నద్దమునన్ నిశ మింటికొప్పునన్
గుదురుచు చుక్కపూవులఁగ♦నుంగొను ప్రేమతరంగదృశ్యమున్.

చిన్నమంచముపైఁ జల్వఁ ♦ జేసినట్టి
మల్లుగప్పిన పఱుపుపైఁ ♦ దెల్లనైన
వలువ నిండారఁగ ముసుంగు ♦ వైచి మేను
వ్రాల్చియుండె నొకానొక ♦ వ్యక్తి యచట.

నుసులున్ బలుమఱుఁ; బ్రక్కకు
వెస మరలున్; మరలఁ దిరుగు ♦ వెలికిలఁ; గడు వె
క్కసముగ నూర్పులు పుచ్చున్;
ముసుఁగున్ సవరించు; మేను ♦ ముడుచున్; జూచున్.

కలఁగిన మది పలుదెఱఁగుల
తలఁపులు గలిగింప నెంత ♦ తడవునకును ని
మ్ములఁ గుదుటఁ బడమి నిద్దుర
వొలయమి శయనమున మేను ♦ వొందమి నంతన్.

ఒక్క మోచేత మై సగ♦మూని, లేచి,
వ్రాలి, తలయెత్తి, గగనంబు ♦ వలనుగాంచి,
మగుడఁదలవ్రాల్చి, కను లర ♦ మొగిచి యెద్ది
యో మదిఁ దలంచి వేఁడిని♦ట్టూర్పు పుచ్చె.

లేచి, కూర్చుండి, దెసలకుఁ ♦ జూచి, యొక్క
మారు తలయూఁచి, వెనుకటి ♦ మధురచరిత
మెల్ల హృదయతమోగుహ ♦ నింత మెఱసి
తుది మలంగినఁ గడు శూన్య♦హృదయుఁ డయ్యె.

అందపు మోముగోము, సొగ♦సైన కనుంగవతీరు, నంటినన్
గందెడు మైపసందు, సిరి♦కాఁపురమైన విశాలవక్షు, మె
న్నందగు కేలుదోయి,వద♦నం బొకయించుక వాడువాఱుటన్
జిందినసొరుఁ జెప్పకయె ♦ చెప్పెడు నాతని శీలవృత్తముల్.

చెదరి నెమ్మోము సొరుఁ గుం♦చింప వ్రాలు
ముంగురులుఁ జెమ్మగిలిన క♦న్నుంగవయును
సొగు నిట్టూర్పులున్ దెల్పుఁ ♦ జాలవెట్టు
లక్కుమారు హృదంబుజం ♦ బలము కలఁత.

పరువు ప్రతిష్ఠయున్ గలుగు♦వంశము, పాడియు బంటయేమిటన్
దరుఁ గొకయింతలేని సిరి, ♦ నవ్యకళాకలనాభిరామతన్
సరసత, సాహితీరస వి♦చారముఁ గల్గిన భాగ్యశాలి; క్రొం
బరువము సౌఖ్యసారము; వి♦పన్నత నందుట కేమి హేతువో?

కొదువయె లేని భావలత◆కుం గుదురై యెదిగింపఁ జాలు ని
ర్వాదియయి దేండ్ల లే గొనబుఁ◆బ్రాయమువాఁడు
"ప్రవాసి" యంట! శా
రద నవ చంద్రికాంకుర క◆రంబిత నిర్జన సౌధమంట! నె
మ్మది సరసప్రసంగ మను◆మాన మిఁకేల తదీయ చింతకుం.

ఏ నవమోహనాంగి లలి◆తేక్షణ జాలములందుఁ జిక్కెనో!
యీనవలామనోజ్ఞుఁ డిఁక ◆ నే తరుణీమణి నిండుకౌఁగిటం
దాను సుఖించెనో! హృదయ◆దర్పణ బింబితరూప నిప్పు డే
చానను గాంచి చేరఁ గనఁ ◆ జాలమిఁబె న్వ్యాలవంత నందునో!

నిండు కౌఁగిళ్ల మేనులు ◆ రెండు నొక్కఁ
డైన వేళల నుభయాంత◆రాత్మ లెఱుఁగు
మదనుఁ డెఱుఁగు నషట్కర్ణ ◆ మంత్రగురుఁడు
వాని మది నున్న వంత యె◆వ్వాని కెఱుక.

## iii

నిలుచుఁ, బచారు సేయుఁ, దన◆నీడఁ గనుంగొను, నేదియో మదిం
దలఁచు, నిమేషమల్లికనుఁ◆దమ్ముల మోడుచు, మింటిచాయఁ జు
క్కలదెస నిండువంకఁ దమ◆కంబున మాటికిఁ జూచు, నేమియో
పలుకు, సరాసరిన్ మరలుఁ, ◆బ్రక్కపయిం బడు, నాతఁ డూరుచుం

దెసలు చూచుచు లేచి ♦ వెస మేడగదిఁ జొచ్చు
జొచ్చి పేటికనెల్ల జూచి వెదకు
వెదకి కొండొకపొత్త ♦ మదవదగాఁ దీయుఁ
దీసి యూరకపుటల్ ♦ దిరుగవైచు
వైచి యేమొ చదు♦వఁగ నెంచి మొదలిడు
మొదలిడి సగమున ♦ మూసివేయు
మూసి కాగితమును ♦ దీసి వ్రాయఁగఁబూనుఁ
బూని తోఁపక వ్రాయ♦మాని నిలుచుఁ
బెదవిపై నూటకలిమిడి ♦ పెద్దతడవు
శూన్యదృష్టుల నూరక ♦ చూచు; లేచు;
బయలఁ జనుదెంచు; మరలలో♦పలికి నేగు;
వాలుకుర్చీపయిని మేను♦వ్రాల్చునతఁడు.

పరిపరి రీతులన్ గుదురు ♦ పాటు నెఱుంగని చిత్తవాజి నే
వెరవుననైన శాంతపద♦విన్ ముదమున్ వహియింపఁజేయఁ జి
త్తరువులటన్ గనుంగొనె న♦తండు మనోజ్ఞ కళాప్రసంగ మాం
తరపరితాప మాఁపఁగ సు♦ధామయ నిర్మలధార గావునన్.

చిత్రముల కేమి కొదువ? యా ♦ చిన్ని మేడ
గదికి నలువంకఁ గుడ్యభా♦గములఁ గలదు
భావ పరిపూర్ణ చిత్ర ప్ర♦పంచమెల్ల
వాని మది కేది విశ్రమ♦స్థాన మగునొ ?

సినిమాబొమ్మలవలె రై
లునఁ జనుచోఁ గ్రింది చెట్టు♦లుఁ బలె నపుడా
తని కనులు పఱచె గదినుం
డిన చిత్రనికాయమునఁ గ♦డింది రయమునఁ.

మురళీధరుని జగ♦న్మోహన గానంబు
విని పర్వులెత్తు గో♦పికలు గాని
కటికిబండకు జీవ♦కళ నిల్పఁజాలు రా
మాయణ మధుర దృ♦శ్యంబుగాని
పతిజీవములఁ బ్రేత♦పతినుండి సాధించు
పరమ పాతివ్రత్య ♦ పరిధిగాని
కనినంత మేనఁ బు♦ల్కల నిన్పఁజాలు రా
ణాప్రతాపాది రా♦ణ్మణులుగాని
మఱియు నవరసభావ సం♦భరిత పూర్వ
నూతనాద్భుత చరిత మ♦నోజ్ఞ చిత్ర
పాళులం దెట్టి రమ్యభా♦వంబుగాని
యిడఁగలే దయ్యె వాని కొ♦క్కింత శాంతి.

చలిత హృదయంబునఁ బ్రశాంతి ♦ నిలుప నతఁడు
సేయు యత్నంబు బూదిలోఁ ♦ జేయు హోమ
మయ్యె రోగనిదానంబు ♦ నరయలేక
సలిపెడు భిషగ్బ్రువుని చికి♦త్సయును బోలె.

ఇనుము సూదంటురాతికి ♦ నెదుట నుండఁ
బ్రక్క నునిచిన వస్తు సం♦భార మట్లు
విరహభావ సమాకర్ష ♦ విచలితాత్మ
హృదయము మరల్పఁజాల దె♦య్యేదియుఁ గాని.

కడకెటో మొలలోఁతు దుః♦ఖంబు లోన
దొరకె మోకాలిలోఁతు సం♦తోషమన్న
కరణి లభియించె నేదియో ♦ విరహజలధిఁ
దేలుచో వాని కొక చిన్ని ♦ తెప్పకొయ్య.

అతని మనమొక్క చిటుకలో ♦ నబ్జనేత్రి
సరస సల్లాపలీలలఁ ♦ బరువువాఱెఁ
జిలుప చిలుపని కన్నీరు ♦ లొలుకు నతని
చూపు లట నున్న యొక పేటి ♦ వైపు వ్రాలె.

పోయినసొమ్ముజాడ మను♦మున్ గను లుబ్ధునిరీతిఁ, దత్త్వమున్
బాయక కన్నబుద్ధుని క్ర♦మంబున నూతన భావసంపదన్
డాయఁగఁజాలు సత్కవి య♦నన్ దన పేటికచాయఁ జూచుచో
నాయువకావతంసుఁ డల♦రారె నొకానొక పందువెన్నెలన్.

కడువేగంబునఁ బేటికన్ దరిసి చొ♦క్కాజేబులోఁ జేరుమా
ల్కడకొంగున్ దగిలించియున్న తన తా♦ళంపుంజెవిన్ దీసి యె
క్కుడు త్రోపాడెడు నాత్మభావతతితోఁ♦గూడంగ నప్పేటికన్
వడకుంజేతుల మూఁతఁదీసె నతఁ డాఁ♦పన్ రాని చిత్తంబునన్.

వివిధ వస్తుసంభరితమై ♦ వెలయునట్టి
పేటికాంతర సీమ భా♦వించు నతని
కన్నుఁ గల్గొల కమృతాంశు ♦ కల దొలంకె
వదనమున జీవకళ తాండ♦వం బొనర్చె.

చేకొనియెఁ జిత్రఫలక మొం♦ డా కుమారుఁ
డతని చిఱుచెమ్మటలు గ్రమ్మ♦నంగవల్లి
భావనామలయానిల♦స్పర్శఁ గదలెఁ
గన్నులకుఁ దట్టెఁ దన ప్రేమ ♦ గాథ లెల్ల.

iv

జడచుట్టనుండి క♦న్పడు, సిల్కురిబ్బను
కుంతలాళిక వింత♦కాంతి నొసఁగఁ
బుష్యరాగమ్ములఁ బొలుచు కమ్మలడాలు
తళుకుఁ జెక్కుళుల ము♦ద్దులకుఁ బెనఁగఁ
బయ్యెద మినుకను ♦ పతకంబు జిగి కుచ
ద్వయతటీరమకుఁ గై♦దండ నిడఁగ
ధవలయొడ్డాణంపు♦రాణ లేఁగౌదీఁగ
కలిమికిఁ బ్రబల సా♦క్ష్యము వచింపఁ
జకితచకిత విలోకన ♦ చ్ఛాయ నలరు
వాలుఁ జూపులు వింతభా♦వాలఁ దొలఁక
జీవకళ లొల్క దిద్ది తీ♦ర్చిన లతాంగి
కన్నుదోయికి నెదుట సా♦క్షాత్కరించె.

కలకల లాడు లేనగుమొ♦గంబునకున్ బవడంబు డంబు స
న్నల నలరించు వాతెఱఁ గ♦నంబడియున్ బడకుండ లేఁత వె
న్నెల నెలయించు పల్వరుస ♦ నీటు మనోహరలీల నూత్నకాం
తులఁ దులకింప నల్లనఁ గనుంగొను రీతిగ నున్న కామినిన్.

కని మేనన్ బులకలు నూ
ల్కొన విస్ఫారిత దృగబ్జ ♦ కోణంబులఁ గ్ర
మ్మిన బాష్పాళి నఖాంచల
మున మీటి సకంపహస్త♦మునఁ బ్రేమనిధిన్.

అద్దుకొనున్ గనుంగవఁ బ్రి♦యంబున నక్కునఁ జేర్పుఁ జెక్కిలిన్
ముద్దుగొనున్ బ్రియోక్తిశత♦మున్ జెవిఁ జేరి వచించు, మోముపై
దిద్దఁగఁ జూచు వ్రాలినటు♦ దీర్చిన ముంగురులన్, గుచాంశుకం
బొద్దిక సేయఁ జూచు నతఁ♦ డూరక నిశ్చలదృష్టియై కనున్.

మొగమింతై వికసత్సరోరుహపరి♦స్ఫూర్తిన్ విడంబింపఁ జి
త్రగతాత్మప్రియకామినీ వదన చం♦ద్రజ్యోత్స్నసమ్మోదభా
వగభీరామృత సాగరం బెగయ సం♦భావించె నవ్వేళలన్
జగమెల్లన్ బ్రమదాన్వితంబుగ నిమే♦షం బవ్వియోగార్తుఁడున్.

తనదు లోకంబె లోకంబు ♦ తనదు తలఁపె
తలఁపుగా మది నూరక ♦ కులుకుఁగాని
పొలఁతి పటమున వ్రాసిన ♦ బొమ్మయనుచు
నెఱుఁగలేఁ డయ్యొ నతఁడు ప్రే♦మైకజీవి.

కులికెడురీతి, జారు జిలు♦గుం బయఁటన్ సవరించురీతి, దన్
బలికెడురీతి, నాత్మగత ♦ భావములన్ వెలిఁబుచ్చురీతి, న
వ్వొలికెడురీతి, జీవకళ ♦ లుట్టిపడన్ గనుపట్టు కామినీ
తిలకముఁగన్న నెవ్వఁడు మ♦దిన్ బటమంచెఱుఁగున్ దటాలునన్.

కాంతయే యను నిశ్చయ ♦ జ్ఞానమేని
కాదు, చిత్తరు వను బోధ ♦ కలనమేని
లేక యద్వైతమోదసం♦లీనుఁడయ్యెఁ
బ్రణయ ముగ్ధుం డతండు వి♦శ్వంబు మఱచి.

"చెలువసందేశమును బ్రియా♦చిత్రఫలక
మాత్మకాంతాక్షరాంకితా♦సంగలేఖ
ప్రేయసీవిరహాగ్నిఁ ద♦పించు ప్రియున
కమృతవర్షంబులై జీవి♦తములఁ దనుపు."

కొంత తడవునకును మది ♦ కుదురు వఱచి
కొని ప్రియాచిత్రమును గేలఁ♦గొని రయమునఁ
బేటికను మూసి చేరె నా♦ప్రేమజీవి
యమృతకిరణాంశుకాంత శ♦య్యాతలమున.

చూచున్ జిత్రపటంబుచాయ; ముకుళించున్ లోచనంబుల్; శిరం
బూఁచున్; లోపలఁదోఁచు కాంతప్రణయం ♦
బూహించుఁ; గాఁగింటికిన్
జాచున్ గేల్గవ; నాతి లేమి మది సం♦తాపించు గన్విచ్చుఁ; మిన్
జూచున్; శీర్షము వంచు; శయ్య శయనించున్; లేచుఁ;
జూచున్ దెసల్.

కళ లుట్టిపడఁగ బొ♦మ్మలసందు తిన్నని
చుక్క దిద్దిన మోము ♦ సొబఁగుఁ జూచి
నుదుటిపై నొక్కింత ♦ మెదలి మోమున వింత
మురువుఁ గైసేయు ముం♦గురులఁ జూచి
యిసుమంత కుడియోర ♦ మసలి పయ్యెద డాఁగు
సరము చన్గవపైని ♦ కరముఁ జూచి
చనువ్రేఁకమున వణం♦కిన నునుందొడ కూఁత
కరణి నిల్చిన పెఱ♦కరముఁ జూచి

దువ్వలువ కుచ్చిళులతోడ ♦ నవ్వులాడు
కొమరు నెలవంక చాల్పాగ♦డములఁ జూచి
యేచు కోర్కుల నొఁదల ♦ నూఁచిమఱచె
జగము నాతండు పారవ♦శ్యప్రసక్తి.

కనుఁగవఁ జూచు చిత్రఫల♦కంబున కామిని రూపుఁ జిత్తమం
దున కనుమూసినన్ జనక♦ తోఁచెడు రూపొకఁడౌట సమ్మదం
బుననో? మఱేటికో? నలిన♦ముల్ డిగఁజాఱు మరందబిందులో
యనఁ గనుపట్టె నాతని దృ♦గంచలసీమఁ గవోష్ణబాష్పముల్.

లోవెలిఁ దోఁచెడు ప్రేయసి
పై వలపున వనట వివశ♦వర్తనుఁ డగుచున్
భావప్రియఁ బలుకున్ గా
మావిలచిత్తుండు బహువి♦ధాలాపంబుల్.

చేతనాచేతనముల వి♦శ్లేష మరయ
నేర రసమాత్ర దళితులౌ ♦ నార లనెడు
కవికులగురూపదేశంబు ♦ కర్ణసీమ
మారు మ్రోగింపదే ప్రేమ♦సారగీతి ”

పొంగి పొరలు బహుభావత
రంగంబుల ప్రేమ సాగ♦రంబునఁ దీరం
బుం గనఁ జాలకతఁడు పలు
కుం గమలదళాక్షి గుఱిచి ♦ కుసుమశరార్తిన్.

౮

తేనెల్ సోనలువాఱ, వ్రాలి యెదపై ♦ దీవంబలెన్, నీకునై
మేనున్ దాల్చితి, నిన్నకై కొనితి నె♦మ్మిన్ బ్రాణముం గాఁగ నీ
దానన్; నీకిదె యాత్మభిక్ష; మనుచోఁ♦దథ్యంబ కన్గొందు బ్రే
మానూనంబగు నీ యకల్మషదృగం♦తాలోకమున్ బ్రేయసీ!

నీకున్ బట్టముగట్టితిన్ బ్రణయరా♦జ్ఞీ! చిత్రసింహాసన
స్వీకారంబున; భావసూనముల బూ♦జింతున్ నినున్; దావకా
లోకప్రాప్తికినై తపింతు సతి; మే♦లోకమ్మునన్ నీవపో
నా కల్పద్రుమ; వలంతు వేటికి; నెలం♦తా! ప్రేమదాసున్ జనున్.

కనకంబుం బయికొన్న పాదరసమై ♦ గాత్రంబునన్ బాదమూ
నిన కుష్ఠంబయి, తమ్మిఁ గ్రిమ్మిన హిమా♦నీపూరమై మానసం
బునుబైపై పయిఁబైకొనున్ దరుణి! దు♦ర్బోధమ్ముగాఁ ద్వాద్వియో
గనితాంతవ్యథ యెంతత్రోసికొనినన్ ♦ గల్లోలమాలావృతిన్.

సంపెఁగతావి పైకొనిన ♦ షట్పదముం బలె నీదు తొంటిప్రే
మంపుఁ దలంపు లొక్కమొగి♦మానసముం గబళింప నక్కటా
అంపపుఁగోఁత లట్లయి క♦రంబు నలంగితి నేల యింక మ
న్నింపవు? కూర్మి నింపవు? గ♦ణింపవు నా హృదయప్రవేదనల్.

ఏటికిఁ జేరరావు తరు♦ణీ! కయిదండ నొసంగి కూర్మిని
ట్లేటికి మాటలాడవు స♦ఖీ!? ప్రణయైక నిధానమైన నీ
వేటికిఁ గోర్కెలూరఁ గది♦యింపవు కౌఁగిటఁ బ్రేయసీ!? కరం
బేటికి ఱిచ్చపాటు నటి♦యింతువు చిత్తరుబొమ్మకైవడిన్?

అబల! నా హృదయేశ్వరుం ♦ డవునొ? కాదొ?
యనుచు విరహావివర్ణుండ♦నైన నన్ను
నరయుచుంటివొ? నీ కను♦లాన నేన
ప్రేయసీ! నీప్రియుండ గు♦ర్తించికొనుము.

బాల! నీచెక్కుట♦ద్దాల నీడలఁజూచి
చుక్క దిద్దినదే యీ ♦ చూచుమోము
మెలఁత! నీప్రేమనిం♦పిన ముద్దులకు నోచి
పులకించినదె యీ క♦పోలసీమ
చెలువ! నీ మునిపంటి ♦ జిలుగు నొక్కుల నూను
తేనె లానినదె యీ♦తీరుమోవి
సకియ! నీదుకరాంబు♦జము మెల్లఁగొని మెడ
పయి నిడినదియె యీ♦పాణితలము

వాసిచెడి, వెల్లనై వాడు♦వాఱి, వేడి
యూరుపులఁ గ్రాఁగి పీటలు ♦ వాఱె, సారు
చెడి వియోగాగ్ని నిట్టులు ♦ చేడుపడియెఁ
గాని యివియెల్ల నీ యెఱుం♦గనివె తరుణి!

అలిగితివో? తలోదరి! ప్రి♦యంబున నే నొకనాఁడు నిద్రమం
పులఁగనుమూయునీచివురు♦మోవిఁజుఱుక్కననొక్కఁగోపమున్
గలఁకయుఁజూపు నీపెడము♦నన్ నునుఁజెక్కిట నారువోయు పు
ల్కలఁ గని గేలిసేయు నప♦కార మెదన్ దలపోసి వాసికిన్.

అలుఁగ మీ మీఁద నేనాఁటి ♦ కైన ననుచు
బాస సేసితి వొకనాఁడు ♦ పద్మనయన!
మఱచితివొ? నా కొసంగిన మాటపట్టు
కోపమే లేని ప్రణయస్వ♦రూపమూర్తి!

మొగముకడమాటో నిజమొ ప్రే♦ముడియటంచు
నాదు ప్రణయస్వరూప మీ♦నాఁడు చిత్ర
ముగఁ బరీక్షింపఁ జూతువో? ♦ ముద్దరాల!
హృదయమున నుండి యిన్నాళు లెఱుఁగ వెట్లు?

అతివ! నే నుడివెడు ♦ ప్రతిమాట నీ చరి
త్రము దక్క నంతరా♦ర్థంబు లేదు
లలన! నా విడుచు నూ♦ర్పుల భవన్నామాంకి
తము గాని దొక సీత్కృ♦తంబు లేదు

ప్రణయినీ! మన్మనో♦భవనాన నీరూప
మెనయని భావద♦ర్పణము లేదు
లలితాంగి! నాదు చూ♦డ్కులకు నీ భావబిం
బము దక్క దృశ్యరూ♦పంబు లేదు
ఏల మత్ప్రేమమును సంశ♦యింతు? వబల!
హృదయ మిచ్చితి నిదె వ్రిచ్చి♦చదువుకొనుము
నీ ప్రణయగీతి దక్క నెం♦దేని యొక్క
యక్కరము వేఱయున్న నీ♦యాన కాన !

వలపెఱుంగని మన్మనో ♦ వారిజమ్ము
విఱియ వలపించి సహస్ర♦కరమరీచి
వోలెఁ దేనియలూర; నేఁ♦డేల దాని
కీలికీలాభవై మా♦డ్తువో లతాంగి !

ఈ పండువెన్నెల♦ కే నీదు చెక్కుట
ద్దాలనీడలఁ జూడఁ ♦ జాలినాఁడ
నీ గాలి కూనల♦ కే జారుపయ్యంటఁ
దడవు నిక్క గౌఁగిటఁ ♦ దార్చినాఁడ
నీ మూఁగి నిసిరేయి♦ కే నీదు కలభాష
నిచ్చమై స్వాగతం ♦ బిచ్చినాఁడ
నీ యూరుబయలునం♦ దే నీకు వినువీథిఁ
గవ చుక్కలను గాన్పుఁ♦గలిగినాఁడ

జాలెఱుంగక చనిన యా♦వేళఁ బ్రణయ
లీలలకు నెల్ల సాక్షి యీ♦వేళఁ దరుణి!
నిన్ను విడు తప్పిదమున న♦న్నియును బగల
మిగిలి నేఁ డిదె వగసెగ♦రగులుకొల్పు.

సకియ! నిన్ దలపోయుట ♦ సవతి మచ్చ
రమ్మునన్ బోలెఁ గవయంగ ♦ రామి నకట
నిద్దురకు మోము వాఁచిన ♦ నేత్రయుగళి
మునుఁగ దిదె స్వప్నదర్శన♦మునకునైన.

ననుఁజూచి కన్నీళు♦లను రాల్చు నీ చెట్ల
పువు రెమ్మలును మంచు♦బొట్ల పేర
నను నూరడింప వా♦కొను వెన్నెలపులుంగు
గములు మింటఁ గలస్వ♦నముల పేర
నాదశఁ దలఁచి డెం♦దాన మ్రాన్పడు నదే
ప్రకృతి నిద్రిత జీవ♦పాళి పేర
నా వంకఁ గనలేమి♦నో విధుండు మొగానఁ
గనుమాటు నిడుఁ గళం♦కంబు పేర

అక్కటా! చేతనాచేత♦నాళి యెల్ల
ననుఁగని కరంబు గనికరం♦బునఁ దపించి
కరఁగి సమదుఃఖతన్ జాటుఁ♦గాని నీవ
ప్రేయసీ! నాదు దశ సయి♦రింతు వెట్లు?

నీ వొకర్తెవె దూరవై ♦ నిలిచితనుచుఁ
దలఁచితిఁగాని నీవెంటఁ దరుణి! నాదు
జీవితానంద సర్వస్వ♦మీ విధాన
దూర మగునంచు మదినొక్క ♦ మారుఁదలఁప.

ప్రేయసీ! పొలయల్కనఁ బెడము వెట్టి
వీఁపు సోకు నా నిట్టూర్పు ♦ వేఁడి కదరి
మదిఁ గరంగి గిరుక్కున ♦ మరలి ముద్దు
లాడెదవు నాఁటిప్రేమ మే♦మయ్యె నేఁడు?

కోయిలకంఠానఁ ♦ గువ్వకూరవమువోలె
నెలఁత, నీలోన లీ♦నింపనిమ్ము
మావిలేఁజివురు రె♦మ్మను గెందళుకువోలెఁ
గలికి! నీమేననే ♦ కలియనిమ్ము
తేనియ పెనువాఁకఁ ♦ దీయందనమువోలె
నతివ! నీలో నైక్య ♦ మందనిమ్ము
కమ్మపుప్పొడి గ్రమ్ము♦తమ్మిఁదావియ వోలెఁ
బడఁతి! నీయెడదనే ♦ యడఁగనిమ్ము.

ప్రకృతి సర్వానురూప దాం♦పత్య సిద్ధి
కై తపింప సర్వంబును ♦ ననఁగి పెనఁగి
జతలు విడివోక కలియు ప్ర♦శాంతవేళఁ
బ్రణయినీ! దూరవై యేల ♦ పలుకరావు?

తన్ను మఱచి లతాంగి చి♦త్రమ్ము మఱచి
బహువిధంబుల వాపోయి ♦ ప్రణయజలధి
మునిఁగి యొకకొంతవడికిఁ బె♦న్మూర్ఛఁగయ్యె
హృదయమే యింద్రజాలానఁ ♦ బదను సెడెనో !

కను విప్పన్ గనుపించు చిత్రగత రా
గస్వామినీమూర్తి క
న్నను చైతన్య కళా విలాస పరిపూ
ర్ణః ప్రేమ మూర్తిన్ గనుం
గొనఁ జిత్తాంబుజమందుఁ బర్వలిడు చూ
డ్కుల్ లాగుటన్ బోలె నా
తని కందోయి నయత్న పాత మను వాం
దన్ జెందెఁ బక్ష్మాగ్రముల్.

ఎద నిండారు వినిర్మల ప్రణయ సా♦హిత్యేశ్వరీ చిత్ర సం
గదశన్ గల్గిన పారవశ్య గరిమన్ ♦ గాఁబోలు నేనాఁటనో
నిదురన్ బాసిన వాని కన్నుఁగవ పూ♦నెన్ సంకుచత్పుండరీ
క దళాంతర్గత మంజుల భ్రమర సం♦కాశాగ్రతారావృతిన్.

పాలసంద్రంపుఁ దరగల ♦ పఱపుపైని
దనువు వాల్చిన పూరుషో♦త్తము విధుండు
నిండు కరములఁ జోకొట్టి ♦ నిదురవుచ్చెఁ
బ్రణయ చిత్రంబుగాదె సం♦పల్లతాంగి!

బయలఁ గనవచ్చు ప్రకృతి రూ♦పంబె లోనఁ
గాంచి నవనవ చైతన్య♦కళ లెఱుంగు
కవికుమారుని హృదయంబు ♦ గానఁ గనులు
మూఁతపడియును నానంద♦మును గమించె.

vi

భావ భావితుఁడైన యా ♦ ప్రణయముగ్ధ
నిర్మలానంద రస సము♦న్మేషవశతఁ
జంద్రికాపూర సోదర ♦ చ్ఛాయమైన
దివ్య తేజం బొకండు హృ♦ద్వీథి వెడలె.

కనుదోయిన్ మిఱుమిట్లు గొల్పుచు మనః♦ కంజంబునం దుండి ది
గ్గన నేకాకృతి నిర్గమించిన నిస♦ర్గప్రేమ తేజంబునం
దున చిత్రాంగన లీనమై చనెనొ? యం♦దున్ దేజమే లీన మ
య్యెనొ? దివ్యాకృతినొత్తుకట్టెదుర హా♦యిన్ గొల్పె నవ్వానికిన్.

కటికి చీఁకటిఁ గవియించు ♦ కాఱుమబ్బు
గర్భకుహరంబుఁ జీల్చియు♦క్కు మొగిఁ దళుకుఁ
జూపుఁ గ్రొమ్మించు దీవ; మిం♦చులను జీల్చి
వెడలె నమృతస్వరూప యీ ♦ వెలఁదిమిన్న.

పొగడంబుల నంటి ♦ బతిమాలి పాదాల
    జీరాడు మైజారు ♦ చెఱఁగుతోడఁ
బిఱుదుపై నెసలాడి ♦ పిక్కల రిబ్బను
    మఱ దుటారించు వా♦లుజడతోడ

గలుగల్లుమని మది ♦ జలుజల్లు మన నేమొ
యెలిఁగించు మట్టెల ♦ యులివుతోడ
జిలుగుఁ బయ్యెదమాటుఁ ♦ జేరి జౌజవలాడి
కళవళం బందు లేఁ♦గౌను తోడఁ
గమ్మ తళుకని యంసభా♦గమ్మునంట
మరలి యింత గిఱుక్కునఁ ♦ దిరుగఁ దోఁచు
భావశబలీకృతాననా♦బ్జంబుతోడ
నెటకో చలపాదియై సతి ♦ యేగుచుండె.

మెఱపు మెఱసిన చందాన ♦ మెఱసి మాటు
వడిన నెమ్మోము గుర్తింపఁ బడకయున్నఁ
దృషిత హృదయుఁ డాపోవని ♦ తెఱఁగు దోఁపఁ
గనియెఁ జెలి నీరు పల్లంబు ♦ గనిన కరణి.

అడుగెత్తి యడుగు వె♦ట్టెడునంత నటియించు
కలికి నితంబభా♦గంబుఁ జూచి
కదలుచో మెరయు బం♦గరుగాజులు మెఱుంగుఁ
దులకింప నూఁగు కే♦ల్దోయిఁ జూచి
కుడివైపు బాడీకి ♦ మెడకు సందుగఁ దళుక్కుఁ
జాయ లూరు పసిండి♦సరముఁజూచి
మైజారు కొకవింత ♦ యోజఁగై సేసి జం
ఘలఁ దాఁకు వాల్జడ ♦ తళుకుఁజూచి

భావపరిపూర్ణమై గుర్తు ♦ పట్టఁజాలు
లలిత తరమైన నడక వా♦లకముఁజూచి
చిత్తరువు పోల్కిఁజూచి కూ♦ర్చెడు ననుంగుఁ
బడతి గుఱుతించెఁ బ్రాణమైక♦భావుఁ డతఁడు.

ఆ యసమానకాంతి సము♦దారకళాకమనీయమూర్తి య
బ్జాయతనేత్రి నైజహృద♦య ప్రణయైక నిధానమంచుఁ జూ
చాయ నొకింత పోల్చుకొనఁ♦జాలెనొ? లేదొ? మఱేమి యెంచె నే
మోహవశాత్ముఁడై శయన♦మున్ విడె జంత్రపుబొమ్మకైవడిన్.

తా వెనుకొన్నయట్లు, వని♦తామణిఁ గూడఁగ ముట్టినట్లు లెం
తోవడి వెన్కఁగాఁ జెలిక♦నుంగవఁ జేతుల మూసినట్లు, ల
లావలితాత్మహస్తముల ♦ నంగన తన్ గవుఁగింటఁ దార్చిన
ట్లేవియొ భావపుం దెఱఁ ల♦నేకము లుప్పతిలెన్ దదాత్మలోన్.

అంబరయానమున్ గొనిన ♦ యట్లు, ధరించినయట్లు పాదలే
పం,బొక మంత్రసిద్ధిఁగను ♦ భంగిని ఱెక్కలు గట్టినట్టి చం
దంబునఁ బాఱినన్ మదమ♦తంగజయానకు నాతఁ డింతదూ
రంబున నుండుఁగాని మెయి♦రాయఁగఁజాలఁ డదేమి చిత్రమో.

కాలవశమున విధి ప్రతి♦కూలుఁడైనఁ
బౌరుషోత్సాహయుతు కార్య♦ఫలము వోలెఁ
జేరువన్ గానుపించియుఁ ♦ జేరి పట్టఁ
బోవ దౌదవ్వులు దొలంగి ♦ పోవు సుదతి.

హృదయ మావేగపడి పరు♦వెత్తినంతఁ
దాఱుమాఱౌనె భవితవ్య♦తాబలంబు
నెఱుఁగఁడో కాక లోకప్ర♦వృత్తి నాతఁ
డరయఁడో భావపారవ♦శ్యమునఁ జేసి.

వలపుల సీమ యాతఁడెటు♦వంటి పరాస్తమనస్కుఁడో చెలిన్
గలిసిపయంటకొంగొదియఁ♦గన్నులమూయజడన్ గ్రహింపఁగే
లలమఁ దలంచుఁగాని తన♦కగ్గము కాక తొలంగు ప్రేయసిన్
బిలువఁగ నేని నోపఁడు ఘ♦నీకృతగద్గదికార్తకంఠుఁడై.

అతని వెనుకొంటఁ జిత్తాన ♦ నరయదొక్కొ?
తెలియదో వాని హృత్పరి♦దేవితమ్ము?
తిరిగి చూడక చను నియ♦తియును బోలె
నిర్వికార స్వరూపమై ♦ నీరజాక్షి.

అనలు గొనలెక్కసాగి యిం♦పలరు పూల
తీవ లల్లినతోట పం♦దిరి హజార
మందు నిముసంబు నిలిచె ల♦తాంగి; కూడ
ముట్టెఁ గను ఱెప్పపాటులో ♦ ముగ్ధుఁ డతఁడు.

అనుఁగుంబైదలి చిక్కెఁ జిక్కెనని బ్ర♦హ్మానందముంబొందు నా
తని సస్వేద సకంప సప్రసరహా♦స్తంబున్ సుధాబిందు చం
దన శీతంబుగ సోకె సోకొకఁడు; దా♦నన్ ముగ్ధుఁడై వాఁడు కా
మిని చేఁజిక్కె నటంచుఁ గన్మొగిచె వి♦స్మేరాననాంభోజుఁడై.

ఎదకుఁ బరిపూర్ణ పరితృప్తి ♦ నీమి, సోకు
నకు నిసింతగఁ గఱకుండ♦నంబు కలిమి
సంశయింపడి కనువిచ్చి ♦ చకితుఁడతఁడు
బేలయై కాంచెఁ జేనున్న ♦ పూలరెమ్మ.

పరిమళంబునఁ, గోమల♦త్వమున, నంద
మున మదిన్ దనియించెడు ♦ ననలరెమ్మ
చెలి కరము వోలుటయు నొక్క ♦ చేటుకయ్యెఁ
గాని కాలాన మేల కీ♦డౌను గాదె.

తనపారవశ్యమున కా
త్మను గుందుచుఁ దత్తరమునఁ ♦ దలిరుం బూరె
మ్మను జేతన్ బోదులిపి న
యనయుగమున్ బఱపె నాతఁ♦డలరుందోటన్.

పందిరి వెట్టి సొంపు గను♦పట్టఁగ నల్లిన పూలతీవలన్
సుందరమైన చోట్లఁ, బరి♦శుద్ధతరాంబుల వింతవింతగాఁ
జిందెడు వారియంత్రముల♦చేఁ జెమరించిన యట్టిపట్ల నిం
దిందిరపాళివోలె నిప♦తించెఁ దదీయదృశాప్రసారముల్.

నవకంపు సొంపుఁ జి♦న్నారి తీవలఁ జిగు
రాకుగా మారి ల♦తాంగి సరయు
వనురాగమూర్తులై ♦ ననుచు లేఁదలిరులఁ
బ్రసవమై కిసలయ♦పాణి నెమకు

దెసలకుఁ దావులం♦దించు పూబంతుల
మధువయి కుసుమకో♦మలిని యోయు
నవరసంబులఁ జిల్కు ♦ పువ్వుఁదేనియల షట్ప
దంబుగా నయి సుధా♦ధరను వెదకుఁ
జేరి తీవఁదీవఁ ♦ జివురాకుఁ జివురాకుఁ
బూఁతబూఁతఁ దేనె ♦ పోఁతఁబోఁత
నరసి యరసి కానఁ ♦ డయ్యెఁ బూఁదోటలోఁ
బ్రకృతి లీనమైన ♦ పడఁతి నతఁడు.

తెమ్మెర కేనియుఁ జొరఁగా
నిమ్మెసఁగని యారములను ♦ నినుని కరమ్ముల్
గ్రమ్మని చలి పందిళులను
నమ్ముగ్ధుం డరసి కానఁ డయ్యెఁ ♦ బ్రణయినిన్.

ఆగడప లట్లు కనుదోయి ♦ నలరఁజేయు
రేఖలఁ దరంగిత శ్రీవ♦రించు నిసుక
తిన్నెపైఁ గూరుచుండి దృ♦గ్దీప్తిఁ బఱపె
నతఁడు నైరాశ్యభావభ♦రాలసముగ.

మును బఱచున్ వెనుదిరుగున్
జనఁ గొంకున్ జనక నిలఁగఁ ♦ జంకున్ దమలో
నన నుడివడు మినువ్రాకును
ననిశ్చితప్రేక్ష్యము లగు ♦ నాతని చూపుల్.

తేఁటి చాలుఁ జేర ♦ బోఁటి కటాక్షమా
లికలని కామి వె♦న్కకును దిరుగుఁ
జివురుటాకుం గని ♦ చెలిమోవి యని చేరి
కాకున్నఁ జిడిముడి ♦ గాఁగ మరలుఁ
బూఁదీవఁ గని విరిఁ♦బోఁణి నెమ్మే నని
జేరి కాకున్న ము♦చ్చిఱుచు మరలు
నవలరెమ్మను గని ♦ వనితలేఁ గైదండ
యని చేరి కామి న♦ల్లాడి సుడియుఁ
జిలుక పలుకుల కని చెలి ♦ పలుకు లనుచుఁ
నరసి కాకున్నఁ గలఁగి మి♦ట్టాడు మింటఁ
జీమ చిటుకన్నఁ జెలియంచుఁ జెదరి కామి
వెనుదిరుగు వాని నిర్లక్ష్య♦వీక్షణములు.

తరువుల గున్నమావి యఱు♦తన్ జలయంత్రము చిల్కరించు శీ
కరములఁ జెమ్మగిల్లి ప్రియు♦కైనునుసోకుపస్న్ జెమర్చు బి
త్తరిమెయి వోలె నొప్పు సిక♦తాతలమం దొక పూలతీవపం
దిరి చివురాకు చాయల జ♦నించె నవో యనురాగ పుంజముల్.

గరగరఁ దిరిగెడు నాతని
నిరీక్షణాల గున్నమావి ♦ నీడల తేజం
బరుదుగ నినుమును సూదం
టురాయివలె లాగికొనెఁ గ♦డున్ వేగముగన్.

వింత వే ఱెఁకేది ♦ వెలయునో యట; నేది
తేఁటిఁ బ్రియము మెయిఁ గ♦దించికొనునొ
పరిమళ ప్రభరిత ♦ పద్మినిగాక; స్వ
ప్రణయమూర్తి నేత్ర♦పర్వమయ్యె.

"అదె పెన్నెఱి వాలుంజడ
యదె నేలన్జీరు పయఁట ♦ యదె సంస్థానం
బదె రూపం బవె భుజలత
లెద సందియమేల దయిత♦యే నిక్కముగన్".

జడపై వ్రాలి పయంటపైమలసి క్రొం♦జాయల్ పిసాళించుచున్
మెడపై నొప్పు సరంబునన్ బెనఁగి నె♦మ్మేన్ దీవకై దోయి ము
ద్దిడి యందుండిన యొక్క చిత్తరువునన్ ♦ హేలాపరిక్రీడితం
బడరించెన్ బ్రణయైకజీవినయనా♦బ్జాలోకన ప్రక్రియల్.

చిత్ర సంసక్తమై వింత ♦ చెయిదములకుఁ
జిక్కి విస్మయ శోక సం♦శిథిలమైన
విరహి హృదయంబు నిండార ♦ విశ్రమించె
జిత్రమున యంద యెట్టి వి♦చిత్రలీల.

కనఁగనఁ దనరూపమె యం
దునఁ గానఁగ నాట నొక వి♦నూతనమగు శ
క్తిని నాకృష్టుండున్ బలెఁ
జనెన్ జెలిన్ జేర సతఁడు ♦ శరవేగమునన్.

చిత్రగతమైన యొక్క వి♦చిత్ర తేజ
మతని నాకర్షణ మొనర్చి ♦ నంత మాయ
మయ్యెఁ జిత్తరు వట నిల్చె ♦ నాతఁ డెదుటఁ
జెదరు చూపుల ముదిత యా♦చ్చెరువు పడఁగ.

వాడినమోముఁ జూచి వసి♦వాడిన చెక్కిలిఁ జూచి నిండి నీ
రాడిన చూపుఁ జూచి తెల♦నై కృశియించిన మేనుఁజూచి క్రొ
వ్వేడిమి యూర్పుఁజూచి చెడి♦పీటలు వాఱిన మోవిఁజూచి య
వ్వాఁడు కళావశేషయగు♦నంగన గుర్తిడె నెట్టకేలకున్

పండువాఱిన మోము♦పై నిత్యనిరుపమా
తత నిర్మలప్రేమ ♦ తాండవింపఁ
బాలిన చెక్కుట♦ద్దాల నిష్కల్మష
నిజమనోభావంబు ♦ నీడఁజూడ
వసివాడుచూడ్కి ది♦వ్యప్రణయోజ్జ్వలా
మేయ తేజము మిఱు♦మిట్లు గొలుపఁ
కృశియించి బిగిఁదొఱం♦గిన మేను దుస్సహా
విరహాసూత్రము టీక ♦ విస్తరింపఁ
బ్రణయమునఁ దీర్చి దిద్దు న♦ప్పసపురూపుఁ
బోలె నేకైక నిశ్వాస♦మునను బ్రేమ
మూర్తి నామంబు జపియించు ♦ ముగ్ధ నెట్ట
యెదుటఁ బ్రియు నొక్కటన్ గని♦యెన్ మృగాక్షి.

చూపుల్ చూపులు వియ్యమందెఁ, జెలి య♦చ్చోవీడి లేచెన్ గలా
లాపం బందెలు గుల్కఁ బైఁట సడలన్ ♦ లజ్జాస్మరాశ్చర్య హే
లాపాణింధమలీల, వాడిన మృణా♦ళంబుల్ దలంపించు బా
హాపాశంబులఁ జుట్టి రొండొరుఁ బ్రమో♦దావేశసంభ్రాంతులై.

సతత తదేక జీ♦వితఁ బాసెఁ దను బ్రియుం
డని ప్రేమ మయి పెడ♦మగుటలేదు
ప్రణయినీ! క్షమియింపు ♦ మని రాగదీన భా
షణలన్ బ్రియుఁడు వేడు♦కొనుటలేదు
లావణ్య శేషంబు♦లై వాడు తనులత
లరసి దుర్విధికి ము♦చ్చిరుటలేదు
మును వియోగాగ్నిఁ గుం♦దిన చందములనెంచి
కడువంతఁ గంట నీ♦రిడుటలేదు
కుశల మడుగుట యును లేదు ♦ కొసకు నొకట
నొండొరు బుజంబులను వ్రాల్చి♦యున్న తలల
నెత్తి ముద్దాడఁ దోఁచుట♦యేని లేదు
చిరసమాగతవల్లభా♦శ్లేష వేళ.

చిరకాలంపు వియోగులై కలిసి ని♦స్సీమానురాగ ప్రసం
గరసావేశులు ప్రేయసీప్రియులు బి♦గ్గన్ గౌఁగిటన్ జొక్కి చి
త్తరువందున్ జిగిదేరుబొమ్మలయి రా♦ధాకృష్ణులుంబోలెఁ దే
లిరి ప్రేమామృతవార్ధివీచికల నో♦లిన్ రాజహంసంబులై.

## vii

కలయో? నిక్కమొ? యైంద్రజాలికసమా♦కర్షంబొ? దైవేచ్ఛయో
తెలియన్ భావబలంబొ? ప్రేమరస సం♦దేశార్థమో? కామినీ
వలయాలంకృతకంధరాంతముదిత♦స్వాంతుండు బాహాంతర
స్థలిఁ గైసేసెఁ "బరివాసి" ప్రేయసిహృదా♦శానవ్యచింతామణిన్.

అనవద్య మనపహార్యం
బనూన మసమాన మనిత♦రావేద్యము ని
త్యనవాభ్యుదయంబై చను
పరిణయామృత మాధురిన్ "బరి♦వాసి"భజించెన్.

పూవుఁదావియుఁబోలె ♦ బొలుతురు గాకంచు
లాలించు మందాని♦లములలోన
నానంద జలధి నో♦లాడుఁ డంచున్ జాలఁ
జిలికించు పండు వె♦న్నెలలలోన
సహజ పరిణయగీతి ♦ సాగుఁ గాకని ఫుల్లు
గము లిచ్చు నవ్యాశి♦షములలోనఁ
దన సర్వమును గాన్క♦తనియుం డనుచు సమ
ర్పణసేయు నిర్మల ♦ ప్రకృతిలోనఁ
దను వెఱుంగని తన్మయ♦త్వంబులోన
లేమ గదియించు బిగి కౌఁగి♦లింతలోన
లీనుఁడై యమృతంబుఁ బా♦లించె నతఁడు
పరిణయ సామ్రాజ్యమున సార్వ♦భౌముఁ డగుచు.

## viii

హృదయ పంజరమునఁ జిల్క ♦ కొదమఁ జేసి
యెట్టు లేలితివో జీవి ♦ తేశు నాఁడు?
పడతి! హృద్విపంచీప్రతి ♦ స్పందమందు
నీ ప్రణయగాన మాలించు ♦ నేఁడు ప్రియుఁడు.

ఏమి నోచితివో మన ♦ స్స్వామి భావ
లీల లీరీతి నొకట డ ♦ క్కోలు గొనఁగ
నేమి తపియించితివొకో సు ♦ ధామయాత్మ!
దివ్య నాట్యంబు ప్రియు నెద ♦ దీటుకొలుప.

ఏలుకొంటివి నీ జీవి ♦ తేశు హృదయ
పదవి నేకసితాతప ♦ వారణముగ
దివ్యరూపాన; లేరు నీ ♦ దీటు జగతి
ధన్యతమ వీవె ప్రణయ మూర్ధన్యచరిత!

## ix

జపియించితి తన్నామము
నపమాయాత్ముండు ముక్తి ♦ నట్టులు ప్రణయా
ధిపఁ గనఁ జాలితి ధన్యుఁడ
వు "ప్రవాసీ!" నిన్నుఁ బోలు ♦ పుణ్యులు గలరే?

ప్రణయ మంత్రంబు తపియించి ♦ పడసికొంటి
తదధిదేవత దివ్య సం♦దర్శనంబు
లేదిఁక వియోగ మనుమాట ♦ నీదుజీవి
తమునఁ బ్రేమ కథా ప్రబం♦ధమున యందు.

కలదె నిక్కల యగుఁగాక ♦ కాంక్షితములు
లేఁ గొనలు సాగి పూచి ఫ♦లించుఁగాక
యెఱుఁగ కుందువు గాక నీ ♦ వింక హృదయ
వల్లభావిరహవ్యథా ♦ భల్లనిహతి.

మొగ మెదుట రాగమున ముచ్చ్ట ♦ మునుఁగు వేళఁ
బ్రణయ మోహంబులకు భేద ♦ పథము లేదు
హృదయ వల్లభ నిశ్శ్వాస ♦ పదవి విహగ
యాన మొనరించు నదె నిత్య♦మైన ప్రేమ.

ప్రణయ మమృతంబు తొలుకారు ♦ బరసవేది
తుల్య హృదయంబులను సోకి ♦ తొలకరించి
సలుపు నజరామరంబులై ♦ సౌరభించు
బంగరపుఁ బూల భావాళి ♦ పల్లవింప.

శ్రీః శ్రీః శ్రీః

---